‘ఎంతో...రు...చి...గ...ల...ది’
అంతా ఇలా అనండి.







గోల్డ్ స్పాట్–
దీని రుచి పెదవిపై చిరునవ్వుగా మారుతుంది.

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల, బేతాళకథ [''మాయ కంబళి''] కి ఆధారం కలువకొలను సదానంద రచన.

ఆగస్టు నెల కథా శీర్షిక పోటీ ఫలితం
''పాపోహం-దాసోహం''
పంపినవారు : జి. రమాదేవి, బెంగుళూరు.

## అమరవాణి

మితం దదాతి హి పితా,
మితం మాతా, మితం సుతః,
అమితస్య హి దాతారం
భర్తారం కా న పూజయేత్? 2

[తండ్రీ, తల్లీ, కొడుకూ ఇచ్చేదానికి పరిమితి ఉన్నది, కాని భర్త ఇచ్చేదానికి మితిలేదు. అలాటి భర్తను, ఎందుకు పూజించరాదు?]

సంపుటి 63 అక్టోబర్ '78 సంచిక 4

విడి ప్రతి : 1-25 : : సంవత్సర చందా : 15-00






**రబీందర్ కుమార్ బేహరా, కటక్ (ఒరిస్సా)**

ప్ర: బేతాళ కథలు నిజమా? ఇతిహాసాలను చరిత్రగా పరిగణించవచ్చునా?

న: బేతాళ కథలు కల్పితాలు. పూర్వపు కల్పనలు ఇరవై అయిదు మాత్రమే; వాటిని 'బేతాళ పంచవింశతి' అంటారు. చందమామలో వచ్చే వందలాది బేతాళ కథలు ఆధునిక కల్పనలు.

ఇతిహాసాలన్నవి రకరకాలుగా ఏర్పడతాయి. కొన్ని చారిత్రిక సంఘటనలు కాలక్రమాన రూపం మారి కట్టుకథలుగా తయారవుతాయి. ఇలాటి కథలలో సూక్ష్మంగా చరిత్రాంశం ఉంటుంది. కొందరు చరిత్ర ప్రసిద్ధులను గురించి కల్పనలు ప్రచారం అవుతాయి. బీర్బల్, తెనాలి రామలింగడు, మహామంత్రి తిమ్మరసు లాటి వ్యక్తులనేకులు ప్రపంచమంతటా కట్టుకథలకు ఆధారంగా పనికివచ్చారు. వీటిలో యుక్తీ, హాస్యమూ లాటివి ముఖ్యంగా ఉంటాయి, కాని ఇవి నిజం కావు. కేవలమూ ఒక నీతినో, ధర్మ సూక్ష్మాన్నో, జీవిత సత్యాన్నో నిరూపించటానికి అనేక కట్టు కథలు పుట్టాయి. వీటిలో ఉండే "నిజం" వేరు.

**జి. రమణరెడ్డి, పల్లెలకుప్పం (ఆంధ్ర)**

ప్ర: చంద్రుని నీడ భూమిపై పడితే అది సూర్యగ్రహణం ఎలా అవుతుంది?

న: సూర్యకాంతికి చంద్రుడు అడ్డం వచ్చి, చంద్రుడి నీడ భూమిపైన పడినప్పుడు, ఆ నీడ ప్రాంతంలో ఉన్నవారికి సూర్యుడు కనిపించడు గనక అది సూర్యగ్రహణం. "గ్రహణం" అనే మాటకు పట్టుకోవటం అనే అర్థం సూర్యగ్రహణానికి గాని, చంద్రగ్రహణానికి గాని వర్తించదు.

**వై. సత్యనారాయణ, బెల్లంపల్లి (ఆంధ్ర)**

ప్ర: కష్టం కొద్దీ ఫలితమంటారు. కష్టించి పని చేసేవారికన్న పెట్టుబడి పెట్టి ఇంట్లో కూర్చునే వారికే ఎక్కువ ఫలితముంటుంది. ఇది ఎలాంటి ఫలితం?

న: శరీరశ్రమ చేసేవారితో పెట్టుబడిదార్లను పోల్చి ఏం లాభం? ఏ రంగంలోనైనా కష్టం కొద్దీ ఫలితం ఉంటుంది. పెట్టుబడిదారుకైనా ఇంట్లో కూర్చున్న దానికన్న కష్టపడితే ఎక్కువ లాభం!




## 64

ఇలా అన్ని కప్పలనూ మింగుతూ పాము ఒకనాడు గంగాదత్తుడి కొడుకైన పితృ ధత్తుణ్ణి మింగింది. ఈ మాట విని గంగాదత్తుడు, "అయ్యో! అయ్యో!" అని ఆక్రందనం చేస్తుంటే, అతని భార్య, "కఠిన చిత్తుడా, ఇప్పుడు ఏడ్చి ఏం లాభం? నీ జాతిని నాశనం చేసుకున్నావు. ఇప్పుడు నిన్ను రక్షించటానికి ఎవరున్నారు? మూఢుడా, ఇప్పటికైనా ఈ మహా నరకం నుంచి బయటపడే మార్గంగాని, ఈ క్రూరసర్పాన్ని చంపేందుకు ఏదైనా ఉపాయంగాని ఆలోచించు," అన్నది.

చిట్టచివరకు అన్ని కప్పలూ పోయి గంగాదత్తుడు మాత్రమే మిగిలింది. అప్పుడు పాము, "గంగాదత్తా, నాకు ఆకలిగా ఉన్నది. కప్పలన్నీ అయిపోయాయి. నన్నిక్కడికి తెచ్చినందుకు, నాకు తినటానికి ఏమైనా చూపించు," అన్నది.

దానికి కప్ప, "మిత్రమా, నేను బతికి ఉండగా నీ కేమీ విచారం అవసరం లేదు. నన్ను మరొక చెరువుకుగాని, బావికిగాని పోనిచ్చే పక్షంలో మరికొన్ని కప్పలు ఇక్కడికి వచ్చేటట్టు చూస్తాను. నీకు బోలెడంత ఆహారం ఉంటుంది," అన్నది.

"నువు నాకు సోదరుడి వంటివాడివి. అందుచేత నేను నిన్ను తినరాదు. నువు చెప్పినట్టు చేశావంటే నాకు తండ్రిలాటివాడివి అవుతావు. కనక, నువు చెయ్యదలచినట్టే చెయ్యి," అన్నది పాము.

కప్ప చేదతాడు మీదుగా బయటపడి, మరొక బావి చేరుకుని, అక్కడి కప్పలతో




చేరిపోయింది. ప్రియదర్శనం కప్ప తిరిగి రావటం కోసం ఎదురు చూస్తూ కొంత కాలం గడిపి, అదే బావిలో మరొక కంతలో ఉంటున్న తొండతో, ''మిత్రమా, నాకొక చిన్న సహాయం చేసి పెట్టగలవా? గంగాదత్తుడు ఎక్కడ ఉన్నదీ వెతికి, అతనితో, 'ఇతర కప్పలు రాకపోతే మానె. త్వరగా వచ్చెయ్యి. నువు లేక బతకలేను. నేను నీకు ఎలాటి హానీ చెయ్యను. నేను ఈ మాట తప్పినట్టయితే, ఎంతో కాలంగా కష్టపడి సంపాదించుకున్న పుణ్యమంతా నీకు ధారాదత్తం అగుగాక!' అని నా మాటగా చెప్పగలవా?'' అన్నది.

తొండ త్వరలోనే గంగాదత్తుణ్ణి కలుసుకుని, "నీ మిత్రుడు ప్రియదర్శనం నీకోసం ఆత్రంగా ఎదురు చూస్తున్నది. త్వరగా వెళ్లు. అది నీ కేమీ హాని చెయ్యననీ, చేస్తే తను సంపాదించిన పుణ్యమంతా నీకు సంక్రమిస్తుందనీ చెప్పమన్నది,'' అన్నది.

ఈ మాట విని కప్ప, ''ఆకలిగొన్నవాడు ఎన్ని పాపాలైనా చేస్తాడు. దుర్బలుడికి దయాదాక్షిణ్యాలుండవు. మిత్రమా, నువు వెళ్ళి గంగాదత్తుడు ఆ బావికి తిరిగి వచ్చేది లేదని ప్రియదర్శనానికి చెప్పు,'' అని చెప్పి, ఉత్సాహంగా కొత్త బావిలోని నీటిలోకి దూకింది.

కోతి మొసలికి ఈ కథ చెప్పి, "పాపిష్ఠి వాడా, గంగాదత్తుడి లాగే నేను కూడా మళ్లీ మృత్యువు నోటిలోకి రాను, ఇక వెళ్లు" అన్నది.

''మిత్రమా, అలా అనకు. మా ఇంటికి వచ్చి, నాకు కృతఘ్నతా పాపం నుంచి విముక్తి కలిగించు; నా ఆతిథ్యం స్వీకరించు. లేకపోతే నిరశనం ద్వారా ఆత్మహత్య చేసుకుంటాను. ఆ పాపం నీకు చుట్టుకుంటుంది,'' అన్నది మొసలి.

''మూర్ఖుడా, ఒకసారి మృత్యుముఖం నుంచి బయటపడి మళ్లీ అందులోకి ప్రవేశించటానికి నేనేమన్నా లంబకర్ణుడి

నను కున్నావా? అది గనక సింహం యొక్క అపారమైన బల ధైర్యాలను చూసి, ఒకసారి ప్రాణం దక్కించుకుని కూడా, గుండె, చెవులూ లేని కారణం చేత మళ్లీ మోసపోయి చావు నోటికి చిక్కింది!'' అన్నది కోతి.

''మిత్రమా, ఎవరా లంబకర్ణుడు? అది చావు నుంచి తప్పించుకుని కూడా తిరిగి ఎలా చావును వరించింది? ఏమిటా కథ?'' అని మొసలి అడగగా కోతి ఇలా చెప్పింది:

గుండె, చెవులూ లేని గాడిద కథ

ఒక దట్టమైన అరణ్యంలో కరాళకేసరం అనే సింహం ఉండేది. ధూసరకం అనే నక్క అస్తమానమూ దాన్ని అనుసరించి తిరిగేది. ఒకసారి సింహం ఒక అడవి ఏనుగుతో పోరాడి తీవ్రంగా గాయపడి, కదలలేని స్థితిలో ఉండిపోయింది.

సింహం వేటాడలేని కారణం చేత నక్కకు తిండి కరువై, నీరసించింది. రెండు రోజుల కటిక ఉపవాసం తరవాత అది సింహంతో, ''మహారాజా, నేను అమితమైన ఆకలి బాధతో కాలు కదప లేకుండా ఉన్నాను. తమకు ఎలా సేవ చెయ్యను?'' అన్నది.

''నువు ఏదన్నా జంతువును మభ్య పెట్టి ఇక్కడికి తీసుకువచ్చినట్టయితే ఏదో విధంగా నేను దాన్ని నీ కోసం చంపుతాను,'' అని సింహం నక్కతో అన్నది.



తగిన జంతువు కోసం వెతుకుతూ నక్క దగ్గిరలో ఉన్న గ్రామానికి వెళ్ళి, ఊరి చెరువు గట్టున గడ్డి మొలకలు అతి ప్రయాసతో తింటున్న లంబకర్ణం అనే గాడిదను చూసి, దాన్ని ఇలా పలకరించింది:

''మామా, నమస్కారం. నిన్ను చూసి ఎంతో కాలమయింది. మరీ ఇంతగా చిక్కిపోయావేం?''

''ఏం చేసేది, అల్లుడూ? చాకలి నా చేత చచ్చే చాకిరి చేయిస్తాడు గాని, పిడికెడు గడ్డి అయినా పెట్టిన పాపాన పోడు. మట్టిగొట్టుకున్న ఈ గడ్డి పరకలు తింటే పుష్టి ఎలా వస్తుంది?'' అన్నది గాడిద.

''కాదా మరి! కాని, మామా, అకనిపించే అడవి పక్కన నది ఒడ్డున చక్కని గడ్డి ఉన్నది గదా, నువు చూడలేదా? అక్కడికి వచ్చి, నాతో కులాసాగా కబుర్లు చెప్పుతూ హాయిగా మేయవచ్చు గదా!'' అన్నది నక్క.

''అల్లుడూ, నీ మాట నిజమేగాని, నా వంటి పెంపుడు జంతువులు అటుగా వస్తే అడవిలోని క్రూరమృగాలు చంపేస్తాయి గద. అది ఎంత మంచి చోటైతే మటుకు నాకేం లాభం?'' అన్నది గాడిద.

''అలా ఎన్నటికీ అనుకోవద్దు. ఆ ప్రాంతం నా రక్షణలో ఉన్నది. నా అనుమతి లేకుండా అక్కడికి ఒక్క పురుగు కూడా రావటానికి లేదు. అదీగాక, నీ యజమాని లాటి క్రూరులు పెట్టే బాధలు పడలేక మూడు ఆడగాడిదలు అక్కడ తలదాచుకున్నాయి. అక్కడి పుష్టికరమైన గడ్డి తిని, నిర్మలమైన నీరు తాగి గాడిద లని పోల్చటానికి లేనంతగా మారిపోయాయి. మంచి యౌవనంలో ఉన్న వాటికి ఇంకా పెళ్ళి కాలేదు. తమకు మంచి భర్తను గ్రామం నుంచి తెమ్మని అవి నన్ను ఎంతో కాలంగా అడుగుతున్నాయి. అందుకే నేను నిన్ను తీసుకుపోదామని యిటుగా వచ్చాను,'' అన్నది నక్క.





# భల్లూకమాంత్రికుడు

## 4

[జలపాతం వెనక నుంచి వచ్చిన భల్లూకమాంత్రికుడు, కాళీవర్మ సాహసాన్ని మెచ్చుకున్నాడు. ఆ సమయంలో అక్కడికి జితకేతరాజు మంత్రి భటులతో వచ్చాడు. మాంత్రికుడు, అతణ్ణి హడలకొట్టి, తలారి ఎనుబోతు మీద ఎక్కించి, అందరినీ నగరానికి బయలుదేరమని ఆజ్ఞాపించాడు. అది సహించని కాళీవర్మ కోపంకొద్దీ మాంత్రికుడిపై కత్తిదూశాడు. తరవాత—]

భల్లూకమాంత్రికుడు ఒక క్షణకాలం కాళీవర్మ మాటలకు నివ్వెరపోయి, అక్కడ వున్నవాళ్ళందరి కేసీ పరీక్షగా చూశాడు. మంత్రి జీవగుప్తుడు తప్ప, మిగతా వాళ్ళందరూ యింకా భయకంపితులయ్యేవున్నారు. జీవగుప్తుడు తానెక్కి వున్న ఎనుబోతును అదిలించి కాళీవర్మను సమీపించబోతున్నంతలో, భల్లూకమాంత్రికుడు, అతణ్ణి ఆపి, "ఓయీ, మంత్రీ! ఇప్పుడు నువు వేయబోతున్న పథకం ఏమిటి? కాళీవర్మను నా మీదికి ఉసికొల్పజూస్తున్నావా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నతో మంత్రి జీవగుప్తుడు వెలవెలపోతూ, "అయ్యా, భల్లూకమాంత్రికా! మీరు నన్ను అపార్థం చేసుకుంటున్నారు. తమలాంటి మహామాంత్రికుల ఆజ్ఞల్ని శిరసావహించటం క్షేమమని, నేనీ యువకుడికి చెప్పబోతున్నాను," అన్నాడు.



ఆ జబాబుకు భల్లూకమాంత్రికుడు చిన్నగా నవ్వి, "నువ్వనే యువకుడు కాళీవర్మే త్వరలో మీ అందరికీ ఆజ్ఞలివ్వబోతున్నాడు, జాగ్రత్త!" అని, యింకా కత్తి దూసి కోపంగా తన కేసి చూస్తున్న కాళీవర్మతో, "కాళీవర్మా, తొందరపడకు! నీవు అంతగా జీవితాను భవంలేనివాడివి. ఇప్పటి స్థితిలో నీ దారిన నువ్వూ, నా దారిన నేనూ వెళ్ళిపోతే, ఆ తరవాత జరగనున్నదేమిటో ఆలోచించావా?" అన్నాడు.

"దాన్నిగురించి అంతగా ఆలోచించవలసిందేమీలేదు. నువ్వు తిరిగి జలపాతం వెనకవున్న గుహలోకి పోతావు; నేను మా గ్రామం చేరి హాయిగా వ్యవసాయం చేసుకుంటూ ప్రశాంతంగా జీవితం సాగిస్తాను," అన్నాడు కాళీవర్మ.

"నువ్వెంత గొప్ప ధైర్యశాలివో, అంత అమాయకుడి వన్నమాట!" అని భల్లూకమాంత్రికుడు మంత్రి జీవగుప్తుడితో, "ఓయీ, మంత్రీ! కాళీవర్మ తన గ్రామం చేరింతరవాత, అతణ్ణి పట్టి తెచ్చేందుకు ఎంతమంది సైనికుల్ని పంపాలని రాజుకు సలహా యివ్వబోతున్నావో దాచకుండా చెప్పు? నీ మనసులో మెదిలే ఆలోచనలు నేను గ్రహించగలను, అబద్ధం ఆడావో నిన్నిక్కడే, ఆ కాలిన ఎండు మానులా నిలువునా భస్మం చేయగలను," అంటూ మంత్రదండం పైకెత్తాడు.

జీవగుప్తుడు ప్రాణభయంతో వణికిపోతూ, "నా ఆలోచనలేవో తమరు పసిగట్టారు గనక, నేను దాచి ప్రయోజనం లేదు. జితకేతరాజుగారి ఉప్పు తింటున్న నేను, ఆయన క్షేమం కోరి, యీ కాళీవర్మను హతమార్చాలని సలహా యివ్వక తప్పదు గదా? మంత్రిగా అది నా ధర్మం!" అన్నాడు.

భల్లూకమాంత్రికుడు మంత్రదండాన్ని గట్టిగా నేలకు తాటించి, "విన్నావా, కాళీ? ఇక నీకీ చంద్రశిలా నగర రాజ్యంలో భద్రత లేదు," అన్నాడు.



కాళీవర్మకు ఆ మాటలతో తన విషమ స్థితి అర్థమైపోయింది. అంత గొప్ప సైన్యం గల జితకేతరాజును తాను ఒంటరిగా గాని లేక కొంతమంది అనుచరుల సహాయంతో గాని ఎదిరించి నిలబడటం దుర్లభం. జితకేతుడి సింహాసనాన్ని తాను ఆక్రమించుకోగలగటమో, అది సాధ్యం కాక పోతే దేశం విడిచి పోవటమో తాను చేయవలసి వున్నది....

కాళీవర్మ యిలా ఆలోచిస్తూ, కత్తిని ఒరలో పెట్టి, భల్లూకమాంత్రికుడితో, "గురూ, తమరు చెప్పింది నిజం! నా క్షేమం సంగతి నాకన్న, నన్ను పెంచి పెద్ద చేసిన బలభద్రు డనే నౌకరుకూ, మీకూ ఎక్కువ తెలిసినట్టున్నది. ఇప్పుడేం ఆజ్ఞ!" అన్నాడు.

భల్లూకమాంత్రికుడు, తన మంత్ర దండంతో కాళీవర్మ భుజాన్ని తాకి, "కాళీ, నీ అదృష్టదేవతే నిన్ను ప్రోత్సహించి, నన్ను గురువుగా సంబోధించమని చెప్పింది. భేష్! నీకు నే నిచ్చేవి ఆజ్ఞలు కాదు, సలహాలు! ఇప్పుడు మనమందరం నగరానికి పోతున్నాం. ఆ జితకేతరాజు దర్పం ఏ పాటిదో చూడాలి. ఓయీ, మంత్రి జీవగుప్తా! నేను ఆ ఎనుబోతు వాహనాన్ని అధిరోహించబోతున్నాను. నువు ముందుండి, దాని ముక్కు తాళు పట్టుకుని నగరం కేసి దారి తియ్యి." అన్నాడు.

మంత్రి జీవగుప్తుడు మారుమాట్లాడకుండా ఎనుబోతు మీదినుంచి దిగి, దాని తాళ్ళు పట్టుకున్నాడు. భల్లూకమాంత్రికుడు ఎనుబోతు మీద కూర్చుని, చుట్టూ వున్న వాళ్ళ కేసి ఓ మారు చూసి, "ఈ ఎనుబోతు చాలాకాలం కిందట, యీ లోకంలో దారి తప్పిన ఒక యమకింకరుడి వాహనం. ఈ మాట నమ్మని వాళ్ళు మీలో ఎవరైనా వున్నారా?" అని అడిగాడు.

ఎవరూ ఆ మాట కాదనలేదు గాని, తలారి మాత్రం ఆశ్చర్యపోతూ ఏదో



గొణుక్కున్నాడు. వాడు ఆ ఎనుబోతును చిన్నపిల్లగా, ఒక పేద రైతు నుంచి చిల్లిగవ్వ యివ్వకుండా బలవంతాన లాక్కున్నాడు; రాజుగారు ఎప్పుడైనా శిరశ్ఛేద శిక్ష విధిస్తే, తల నరక్కుండా వదులుతానని మాత్రం దాని యజమానికి మాట యిచ్చాడు.

భల్లూకమాంత్రికుడు తన మంత్రదండాన్ని ఎనుబోతు తలమీద ఒకసారి తాకించి, ''కింకరా! క్షుద్ర మానవుడి చేతబడి, పుట్టుకతో అబ్బిన అపూర్వ శక్తులు పోగొట్టుకున్నానని సంశయిస్తున్నావా? అదేం లేదు. ఏదీ, భూమి మీది నుంచి ఒకటి రెండు గజాల ఎత్తున గాలిలోకి లేచి, నగరం కేసి కొద్ది దూరం ప్రయాణం చెయ్యి.'' అన్నాడు.

ఆ వెంటనే ఎనుబోతు ముక్కుపుటాల నుంచి బుస్సుమంటూ తుఫాను వేగంతో గాలి వదిలి, తల పైకెత్తి కర్ణకఠోరంగా అరిచి, నేలమీది నుంచి అలవోకగా గాలిలోకి లేచి, నగరం కేసి బయలుదేరింది. ఎనుబోతు అలా పైకి లేచే సమయంలో దాని ముక్కు తాళ్లను జారవిడిచిన మంత్రి జీవగుప్తుడు, పడుతూ లేస్తూ దాని కేసి పరిగెత్తసాగాడు.

భల్లూకమాంత్రికుడు కొంతదూరం పోయి ఎనుబోతును నేలకు దించి, మంత్రి దాని తాళ్ళు పట్టుకోగానే, వెనక వస్తున్న వాళ్ళ కేసి చూసి, ''ఎంతటి మహామంత్రికి, ఎలాంటి దుర్గతి పట్టిందో చూశారా?'' అన్నాడు.

అప్పటివరకూ యీ జరిగినదానినంతా మౌనంగా చూస్తూ గుర్రంమీద కూర్చుని వున్న కాళీవర్మ, మాంత్రికుణ్ణి సమీపించి, ''మిమ్మల్ని నేను గురువుగా భావిస్తున్నాను. అట్లని నాకు యిష్టం లేని ఆజ్ఞలన్నిటికీ తల ఒగ్గుతాననుకోకండి. మీరు నిజంగానే ఆ దుష్టుడైన జితకేతరాజును శిక్షించబోతున్నారా?'' అని అడిగాడు.

''గురుశిష్యులన్న తరవాత, గురువు, శిష్యుడికి మేలు చేకూర్చే ఆజ్ఞలే యిస్తాడు.

అది సరే, నీకు జితకేతరాజు సింహాసనం ఆక్రమించాలని వున్నదా?" అని అడిగాడు భల్లూకమాంత్రికుడు, కాళీవర్మ ముఖం కేసి పరీక్షగా చూస్తూ.

"నాకు అలాంటి దురాశ లేదు. నేను కోరేదల్లా ఆ రాజు నిర్దోషుల్ని శిరశ్ఛేదం లాంటి అమానుష శిక్షలకు పాలుచేయకుండా వుండటం," అన్నాడు కాళీవర్మ.

"ప్రయత్నించి చూస్తాను, కాళీ! కాని, పుట్టుకతోనే సింహాసనానికి వారసులయే జితకేతరాజు లాంటివాళ్ళు, ఒక పట్టాన మారరు. అవునా, మంత్రీ?" అన్నాడు భల్లూకమాంత్రికుడు.

"మహా గొప్పగా సెలవిచ్చారు, మాంత్రికులు!" అన్నాడు మంత్రి జీవగుప్తుడు.

తరవాత అందరూ నగరం కేసి కొంత దూరం ప్రయాణించాక, ఇద్దరు ఆశ్వికులు వేగంగా వాళ్ళ ముందుకు వచ్చి, దారిని అటకాయిస్తూ, "ఎనుబోతు మీద సన్యాసిని ఎక్కించి, పట్టుదుస్తులూ, చెవికి బంగారు కుండలాలూ ధరించిన మనిషి, ముందుండి దారితీయడమేమిటి? ఆ నల్ల గుడ్డలతో, పిశాచిలాగా వున్న వాడు పంచకళ్యాణి లాంటి గుర్రం ఎక్కి సవారీ చేయటమా? ఎవరు మీరు?" అన్నారు పళ్ళు కొరుకుతూ.



ఆశ్వికులకు కాళీవర్మ జవాబివ్వబోయేంతలో, భల్లూకమాంత్రికుడు పెద్దగా నవ్వి, ఆశ్వికులతో, "మీరు జితకేతరాజు సైనికులు కాదన్నమాట; అందువల్లే మమ్మల్ని పోల్చుకోలేకపోయారు. మేం ఎవరమో మరిచిపోయి, ఆ సంగతి తెలుసుకునేందుకు ఆ కనబడే నగరం పోతున్నాం," అన్నాడు.

"ఈ వేళాకోళం మాటలు కట్టిపెట్టు. మేం ఎవరమో తెలుసా? ఉదయగిరి రాజైన దుర్ముఖుడి సైనికులం. ఇప్పుడే దిరిసెనవనంలోకి పోయి వస్తున్నాం. అక్కడ కాళీవర్మ అనేవాడు గాని, వాడి శవంగాని కనిపించలేదు. అన్న



అప్పటికే తానేదో నలుగురిలో నవ్వుల పాలయానని బాధపడుతున్న తలారి పళ్లు కొరుకుతూ గండ్రగొడ్డలిని పైకెత్తి, ''ఒరే, పొగరుబోతా! నేనెవరైనదీ తెలిసీ అవహేళన చేస్తున్నావా? అదుగో, అగుర్రం మీదవున్న పెడతల శవాన్ని చూశావా? నీకూ ఆ గతి పట్టిస్తాను,'' అన్నాడు.

ఆ జవాబు విని కాళీవర్మ ఉత్సాహం కొద్దీ గుర్రాన్ని తలారి దగ్గిరకు పరిగెత్తించి, కత్తితో అతడి భుజాన్ని తట్టి, ''కుక్క కాటుకు చెప్పుదెబ్బలాంటి జవాబిచ్చావు, తలారీ! పనిలో పనిగా యీ దుర్ముఖుడి అశ్వికుల తలలు నరుకుతావా ఏం!'' అని అడిగాడు.

''అంతా భల్లూకమాంత్రికుల దయ! వారు ఆజ్ఞాపిస్తే, అంతపనీ చేయాలని వున్నది. ఈమధ్య ఒకటి, రెండు వారాలుగా నా గండ్రగొడ్డలి నెత్తురు చూసిన పాపాన పోలేదు,'' అన్నాడు తలారి.

అంతలో దుర్ముఖుడి అశ్వికుల్లో ఒకడు గుర్రాన్ని అదిలించి, పెద్దగా కేకపెడుతూ, "వీళ్ళెవరో నరమాంస భక్షకులు! మనిషిని చంపి, శవాన్ని పెడముఖంగా గుర్రం మీదకట్టి, నగరానికి తీసుకుపోతున్నారు," అన్నాడు.

భల్లూకమాంత్రికుడు ఛీత్కరిస్తూ ఆ ఇద్దరు అశ్వికుల కేసీ ఓమారు చూసి మాట తప్పినందుకు జితకేతరాజు మీదికి, మా రాజుగారు దాడి రాబోతున్నారు,'' అన్నారు దుర్ముఖుడి అశ్వికులు.

''అయితే, యీ సంగతులన్నీ మాకు మనవి చేయటమెందుకు? ఇక దారి తొలిగి, మీ దారిన మీరు పొండి," అన్నాడు భల్లూకమాంత్రికుడు కోపంగా.

అంతలో దుర్ముఖుడి అశ్వికుల్లో ఒకడు తలారి కేసి ఆశ్చర్యంగా చూస్తూ, ''ఇంతకుముందు చూడగానే గుర్తుపట్టలేకపోయాను. నువ్వు దిరిసెన చెట్ల తోపులో వుండే జితకేతరాజు తలారివి కాదా?'' అన్నాడు హేళన చేస్తున్నట్టు వికవికమని నవ్వుతూ.

కాళీవర్మతో, "కాళీ! ఈ చచ్చువెధవల వెకిలివాగుడు మరెంతసేపు భరించేట్టు!" అన్నాడు.

వెంటనే కాళీవర్మ కత్తిదూసి, "ఒరే, దుర్ముఖుడి సేవకుల్లారా, మర్యాదగా మీ దారిని మీరు పోతారా, తలలు నరికించుకుంటారా?" అన్నాడు.

ఆ వెంటనే మంత్రి జీవగుప్తుడి వెంట వచ్చిన అశ్వికులిద్దరూ డాళ్ళు పైకెత్తి, కత్తులు దూసి, దుర్ముఖుడి అశ్వికుల కేసి తమ గుర్రాలను దూకిస్తూ, "ఆ పని మాకు వదలండి. ఈ పొగరుబోతులు చాలా అవమానకరంగా మాట్లాడు తున్నారు," అంటూ వాళ్లమీద పడ్డారు.

దుర్ముఖుడి అశ్వికులు కూడా కత్తులు దూసి ఆత్మరక్షణ చేసుకుంటూ, తమ గుర్రాలను అదిలించి పారిపోతూ, "దుర్ముఖ మహారాజుగారు, యీ దాపుల నున్న మామిడితోటలోనే గుడారాలు వేసుకుని వున్నారు. క్షణాల మీద ఆయన వచ్చి, మీ అందర్నీ చిత్రవధ చేయించ గలడు," అంటూ కేకలు పెట్టారు.

జీవగుప్తుడి అశ్వికులిద్దరూ, శత్రు అశ్వికుల్ని చాలా దూరం తరుముకుంటూ పోయి, వాళ్ళు ఎంతకూ తమ కత్తి దెబ్బలకు అందకపోవటంతో, తిరిగి వచ్చారు.



అంతలో జీవగుప్తుడి భటులలో ఒకడు, పక్కకు చూస్తూ, "అయ్యా, యీ సారి పదిమంది శత్రుఅశ్వికులు మన మీదికొస్తున్నారు!" అంటూ అరిచాడు.

వాడు అన్నట్టు నిజంగానే పదిమంది దుర్ముఖుడి అశ్వికులు వాళ్ళను సమీపించారు. కాని, వాళ్ళు కత్తులు దూసి కలియబడక, కొంచెం దూరంలోనే ఆగారు. వాళ్ళలో ఒకడు దుస్తుల్లోనుంచి ఒక పొడవాటి పత్రాన్ని తీసి పెద్ద గొంతుతో యిలా చదివాడు; "ఇక్కడ వున్న వాళ్ళంతా, మామిడితోటలో విడిది చేసివున్న దుర్ముఖ మహారాజుగారి సముఖానికి రావాలి. ఇది రాజాజ్ఞ!"

అది వింటూనే అందరూ విస్తుపోయి చూసేంతలో భల్లూకమాంత్రికుడు తను ఎక్కి వున్న ఎనుబోతును దుర్ముఖుడి అశ్వికుల కేసి తిప్పమని మంత్రి జీవ గుప్తుణ్ణి ఆజ్ఞాపించి, దుర్ముఖుడి అశ్వికులతో, "దుర్ముఖుడంతటివాడు ఆజ్ఞాపిస్తే, యిక చేయగలిగిందేమిటి? అతడున్న మామిడితోటకు దారితీయండి," అన్నాడు.

"గురూ, ఏమిటిది?" అన్నాడు కాళీ వర్మ ఆశ్చర్యపోతూ.

"స్వయంగా నువే చూద్దువు గాని," అన్నాడు భల్లూకమాంత్రికుడు.

దుర్ముఖుడి అశ్వికులు వాళ్ళను సరాసరి వాళ్ళ రాజున్న మామిడితోటకు తీసుకుపోయారు. రాజు దుర్ముఖుడు ఒక ఎత్తయిన ఆసనం మీద కూర్చుని వున్నాడు. దానికి అటూ యిటూ యిద్దరు ఖడ్గ ధారులూ, కొంచెం ఎడంగా మంత్రులూ, సలహాదారులూ తలలు వంచుకుని నిలబడివున్నారు.

భల్లూకమాంత్రికుణ్ణీ, అతడి వెంట వున్న వాళ్ళనూ చూస్తూనే దుర్ముఖుడు కళ్ళెర్రచేసి, "ఒరే, దుష్టులారా! తలారితో ప్రారంభించి మీ అందరి తలలూ నరికించబోతున్నాను. ఆఖరి వంతు కాళీ వర్మ అనేవాడిది," అన్నాడు.

దుర్ముఖుడు యిలా అనగానే భల్లూక మాంత్రికుడు, "అది భల్లూకా!" అంటూ ఒక కేకపెట్టి, ఎనుబోతు మీది నుంచి దిగి, ప్రాణభయంతో గడగడ వణుకుతున్న తలారితో, "ఒరే, తలారీ! నీ తల దుర్ముఖుడు నరుకుతాడో, లేక వాడి తల నువ్వు నరుకుతావో, యీ క్షణం లోనే తేలిపోతుంది," అంటూ మంత్ర దండం చివరనున్న భల్లూక తలాటంతో, వాడి వెన్నును తాకాడు.

ఆ మరుక్షణం తలారి నల్లని భల్లూకా కారంతో గండ్రగొడ్డలిని గిర్రున తిప్పుతూ, గుర్రం మీది నుంచి కుప్పించి దూకి, భీకరంగా అరుస్తూ, రాజు దుర్ముఖుడి కేసి పరిగెత్తాడు! —(ఇంకావుంది)






## మాయకంబళి

పట్టువదలని విక్రమార్కుడు చెట్టువద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి బయలుదేరాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, ''రాజా, నువు ఏదో అతీతశక్తులు కోరి ఇలా శ్రమపడుతున్నా వనటానికి సందేహం లేదు. కాని అవి తీరా నీకు లభించినాక నువు వాటిని విసర్జించవని చెప్పటానికి లేదు. ఇందుకు నిదర్శనంగా నీకు చండీదత్తుడి వృత్తాంతం చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

పూర్వం హిమాలయ పర్వతాలలో ఆత్మానందు డనే వృద్ధయోగి ఉండేవాడు. చుట్టుపక్కల వాళ్లు అయనను తరచుగా చూడవచ్చి, ప్రశ్నలతో వేధించుతూ, ఆయన ఏకాగ్రతను

## బేతాళ కథలు



చెడగొట్టుతూ ఉండేవారు. అందుచేత ఆయన తన పాత కంబళి మీద మంత్రజలం చల్లి, దానికొక శక్తిని కలగజేశాడు; ఆయన దాన్ని కప్పుకుంటే ఎవరికీ కనబడడు! ఈ రహస్యం మాత్రం ఎవరికీ తెలియదు.

ఒకరోజు ఆత్మానందుడు తన కంబళి భుజాన వేసుకుని, ఒక శిలమీదుగా దాటుతూ కాలు జారి, శిలకు అవతల ఉన్న లోయలోకి దొర్లి పడిపోయి, స్పృహ కోల్పోయాడు. అతని కంబళి శిలకు ఇవతలిపక్క పడిపోయింది.

మరికొంతసేపటికి ఆ కనుమ దారిన ఒక చిల్లరవ్యాపారి సంతకు పోతూ, కంబళిని చూశాడు. అది చాలా పాతది. ఏ దరిద్రుడైనా ఏదో ధరకు దాన్ని కొనకపోతాడా అనుకుని ఆ మనిషి దాన్ని మడిచి మూటలో పెట్టి, సంత జరిగే శోభావతీ నగరానికి వెళ్ళాడు. శోభావతిలో ఓ ముసలి బిచ్చగాడు చలితో బాధ పడుతూ, ఆ పాత కంబళిని చౌకలో కొనుక్కొని, వెంటనే దాన్ని కప్పుకున్నాడు. చూస్తుండగానే బిచ్చగాడు అదృశ్యం కావటం గమనించి అందరూ ఆశ్చర్యపోయారు.

ఈ వింత వార్త క్షణాలమీద నగరమంతా పాకింది. ఆ కాలంలో శోభావతిలో దొంగతనాలూ, అవినీతీ, స్పర్థలూ పెచ్చుమీరి ఉన్నాయి. శోభావతి రాజయిన చండీదత్తుడు ఎంత ప్రయత్నించినా వాటిని అదుపులో పెట్టలేకపోయాడు. ఈ సమయంలో కంబళి మహత్తు గురించి అందరికీ తెలియటంతో, దురాశాపరులు బిచ్చగాడి కోసం వెతకసాగారు. దొంగతనాలు చెయ్యటానికీ, యథేచ్ఛగా అవినీతి కొనసాగించటానికీ, పట్టుబడకుండా ప్రతిపక్షాలమీద దెబ్బతీయటానికీ అలాటి అదృశ్యకరణి ఎంతైనా ఉపయోగపడుతుంది.

కంబళి సహాయంతో అదృశ్యంగా ఉన్న బిచ్చగాడు నలుగురూ అనుకునే

మాటలు విని, తనకు రానున్న ప్రమాదాన్ని గ్రహించి, తన చేతికర్రను ఒక పొదలో పెట్టి, ఎలాటి చప్పుడూ చేయకుండా మసలసాగాడు. ఆ కంబళి వల్ల వాడికి అడుక్కు తినటానికి కూడా లేక పోయింది.

ఆ రాత్రి అంతా వాడు ఆలోచించి, తన కంబళి కోసం దేశంలో హేమాహేమీలు తహతహ లాడుతున్నారనీ, అది తనకు ఎందుకూ పనికిరాదనీ రూఢి చేసుకుని, మర్నాడు తెల్లవారగానే తాను వాళ్ళ కంటపడకుండా కంబళి కప్పుకుని అదృశ్యంగా రాజసభకు వెళ్ళి, తాను కప్పుకున్న కంబళి తీసి, రాజు ఎదుట ప్రత్యక్షమయాడు.

''మహాప్రభూ, ఈ కంబళి వల్ల నాకు ప్రాణహాని తప్ప, శాంతిగాని, సుఖంగాని ఉండదు. ఇది మీ వద్దనే ఉంచండి." అని బిచ్చగాడు కంబళిని రాజుకు ఇచ్చాడు. రాజు దాన్ని స్వయంగా పరీక్షించి, దాని మహత్తును తెలుసుకుని, బిచ్చగాడికి జీవితం సుఖంగా వెళ్ళిపోయే ఏర్పాటు చేసి, కంబళి తాను తీసుకున్నాడు.

ఈలోపల కొండమీద పడిపోయిన ఆత్మానందుడు కోలుకుని, తన కంబళి చండీదత్తుడి వద్ద ఉన్నదని తెలుసుకుని, శోభావతీనగరానికి వచ్చి, రాజును కలుసుకుని, తన కంబళి తన కియ్యమని అడిగాడు.





రాజు అందుకు అభ్యంతరం చెబుతూ, "రాజ్యశ్రేయస్సు దృష్ట్యా, ఇది నా దగ్గర ఉండటమే మంచిది," అన్నాడు.

ఆత్మానందుడు తన కంబళిని రాజు వద్ద ఉంచటానికి ఒప్పుకుని, ఎందుకైనా మంచిదని చెప్పి, రాజు చేతికి ఒక రక్షాబంధం కట్టి, వెళ్లిపోయాడు.

రాజు మాయకంబళి సహాయంతో నగరంలోని అనేకమంది అవినీతి పరులనూ, కుట్రదార్లనూ పట్టుకొని, కఠినంగా శిక్షించాడు. మాయకంబళి ఆచూకీ తెలియక తహతహ లాడుతున్న గొప్పవారికి అందరికీ, మాయకంబళి రాజు వద్దకు చేరినట్టు స్పష్టమయింది. దొంగల ముఠాల దగ్గర నుంచి అనేక మంది అవినీతిపరులు కఠినంగా శిక్షించబడటంతో, నగరంలో నేరాలూ, అక్రమాలూ పూర్తిగా తగ్గిపోయాయి. చండీదత్తుడి మనస్సుకు కొంత ప్రశాంతత చేకూరింది.

ఒకనాడు రాజుకు రాజనర్తకి అయిన చంచలను చూడా లనిపించింది. అతను కంబళి కప్పుకుని, ఎవరికీ తెలియకుండా చంచల ఇంటికి వెళ్ళాడు. అటు తరువాత రాజు ఎవరికీ తెలియరాకుండా చంచల ఇంటికి వెళ్లి రాసాగాడు.

ఒకరోజు చంచల మాయకంబళిని రెండు రోజులపాటు తన ఇంట ఉండ నియ్యమని రాజును కోరింది. ఆమె ముచ్చటను రాజు నిరాకరించలేక, "నువు నాతో నా మందిరం దాకా అదృశ్యంగా వచ్చి, కంబళి నీ వెంట తీసుకుని పో," అన్నాడు.

ఇద్దరూ కంబళి కప్పుకుని రాజ మందిరానికి వచ్చారు. చంచల అక్కడ రాజును విడిచి, కంబళి కప్పుకుని తిరుగు ముఖం పట్టింది. వెళ్లిపోతున్న ఆమెను చూసి రాజు ఆశ్చర్యచకితుడైనాడు. ఆమె అతనికి స్పష్టంగా కనిపిస్తున్నది. దానికి కారణం, ఆత్మానందుడు

తన చేతికి కట్టిన రక్షాబంధం అయి ఉంటుందని రాజుకు తోచింది.

చంచల తిన్నగా తన మందిరానికి వెళ్ళక, మరొక దిక్కుగా, కోశాధికారి విక్రముడి మందిరానికి వెళ్ళటం చండీదత్తుడు చూశాడు. విక్రముడు రాజుకు జ్ఞాతి. చంచల అతని పద్దకు ఎందుకు వెళ్లిందోనని ఆలోచిస్తూ చండీదత్తుడు శయనాగారానికి వెళ్లి పడుకున్నాడు. కానిఅతనికినిద్రపట్టలేదు.

ఒక రాత్రివేళ విక్రముడు కంబళి కప్పుకుని, చేత కత్తిపట్టుకుని తన శయనాగారం ప్రవేశించడం రాజు చూసి, తనను చంపటానికి వచ్చాడని గ్రహించి, చిహాలున కత్తి దూసి లేచి, విక్రముడి మీద పడ్డాడు. రాజు నిద్రపోతూంటాడనీ, మేలుకుని ఉన్నా కంబళి మూలాన తనను చూడలేడనీ నమ్మిన విక్రముడు ఇలాటి పరిణామానికి సిద్ధంగా లేక, రాజు చేతిలో తేలికగా చచ్చిపోయాడు.

రాజాజ్ఞ ప్రకారం భటులు చంచలను బంధించి తెచ్చారు. రాజును హత్య చేసి వారసత్వాన్ని బట్టి తాను రాజు కావాలని విక్రముడు అనుకున్నాడనీ, చంచల చేసిన సహాయానికి ఆమెను పట్టపురాణిని చేస్తానని ప్రలోభ పెట్టాడనీ ఆమె రాజుకు చెప్పింది.

- చండీపత్తుడు ఆమెను దేశం నుంచి బహిష్కరించాడు.



ఆ మర్నాడే రాజు హిమాలయాలలో ఆత్మానందుడున్న చోటికి వెళ్ళి, ''స్వామీ, మీ కంబళిని మీరే ఉంచుకోండి,'' అని మాయకంబళిని ఇచ్చేశాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, నాకు కొన్ని సందేహాలున్నాయి. ఆత్మానందుడు తన కంబళి కోసం శోభావతి నగరానికి వెళ్ళి, రాజును కంబళి ఇయ్యమని ఎందుకు అడగవలసి వచ్చింది ? తనకు కావాలంటే ఇంకో కంబళిని సృష్టించుకోలేకనా ? లేక తన కంబళి ఇంకొకరి అధీనంలో ఉండటం ఇష్టంలేకనా ? రాజు ఆ కంబళి సహాయంతో ఎందరో నేరస్థులను శిక్షించి, దాని ప్రయోజనం గ్రహించి కూడా చివరకు దాన్ని ఆత్మానందుడికి ఎందుకు తిరిగి ఇచ్చాడు ? రాజ్యంలో ఇంకా విక్రముడిలాటి కుట్రదార్లు ఉండరనా? ఈ సందేహాలకు సమాధానాలు తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలి పోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''మహిమగల వస్తువు మంచివాళ్ళ చేతిలో మంచికీ, చెడ్డవారి చేతిలో చెడుకూ ఉపయోగ పడుతుంది. కొందరికి ఎందుకూ ఉపయోగపడదని బిచ్చగాడి అనుభవం ద్వారా మనకు తెలుసు. పైపెచ్చు వాడికి కంబళిలో ప్రమాదమే కనబడింది. తాను మంచివాడు గనక రాజు దాన్ని మంచికే ఉపయోగించవచ్చునని భ్రమ పడ్డాడు. ఆ కంబళి దుష్టులచేతికి పోతే రాజుకు ఎంత ప్రమాదమో తెలిసి ఆత్మానందుడు అతని చేతికి రక్షాబంధం కట్టాడు. అయన శోభావతినగరానికి వెళ్లి రాజును కంబళి ఎందుకు అడిగాడో దాన్నిబట్టే తెలుస్తుంది. రాజు కూడా ఆ సంగతి గ్రహించగానే కంబళిని ఆత్మానందుడికి తిరిగి ఇచ్చేశాడు,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగ గానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# తెలివిలేని మంగమ్మ

దేవాపురంలో రంగయ్యా, మంగమ్మా అనే దంపతులు ఉండేవారు. రంగయ్య ఊళ్లు తిరిగి వ్యాపారం చేస్తాడు. మంగమ్మ వట్టి అమాయకురాలు. రంగయ్య ఆమెకు ఎన్ని జాగ్రత్తలు చెప్పినా ఎవరో ఒకరు మోసం చేస్తూనే ఉండేవారు. అయినా రంగయ్య ఆమెతో ఎలాగో సంసారం నెట్టుకొస్తున్నాడు.

రంగయ్య కొంచెం దూర ప్రయాణం మీద పోతూ, "ఊళ్ళో దొంగలు ఎక్కువ అయారు. ఎవరితోనూ మాట్లాడవద్దు. మోసగాళ్ళు వస్తే, పోకుండా పొగపెట్టు!" అన్నాడు.

ఆ రాత్రి మంగమ్మ ఇంట్లో ఒంటరిగా ఉన్నది. ఆమె నిద్రపోతూండగా, తలుపు ఎవరో బాదినట్టు వినిపించి, నిద్రాభంగమయింది. ఆమె లేచి తలుపు తెరిచిన మరుక్షణం ఇద్దరు దొంగలు హడావుడిగా లోపలికి తోసుకొచ్చారు. వాళ్ళ చేతుల్లో ఏవో మూటలున్నాయి.

వాళ్ళు దాక్కునేటందుకు చోటు వెతుక్కుంటూ, "మా కోసం రక్షకభటులు వస్తున్నారు. వారితో మా సంగతి ఏమీ చెప్పవద్దు," అన్నారు.

కొద్ది సేపటికి రక్షకభటులు వచ్చి తలుపు తట్టారు. మంగమ్మ తలుపు తెరిచింది. "లోపల మగవాళ్లున్నారా?" అని రక్షకభటులు అడిగారు.

వాళ్లు తన భర్తమాట అడుగుతున్నారనుకుని మంగమ్మ లేరన్నట్టు తల అడ్డంగా ఆడించింది. ఎవరితోనూ మాట్లాడవద్దని భర్త చెప్పి ఉన్నాడు గద!

"ఇటుగా ఎవరైనా పరిగెత్తిపోయిన ధ్వని వినిపించిందా?" అని ఒక రక్షకభటుడు ఆమెను అడిగాడు. లేదన్నట్టు మంగమ్మ మళ్ళీ తల ఆడించింది.

---

పి. ఖాదర్ వలీఖాన్

"ఈమె మూగది! కాలయాపన చేస్తే దొంగలు మరింత దూరం పోతారు," అన్నాడు ఇంకొక రక్షకభటుడు.

రక్షకభటులు వెళ్ళిపోయారు.

దొంగలిద్దరూ ఇవతలికి వచ్చి, "మనం ఇక్కడే సొమ్ము పంచుకుందాం. ఈమె మూగది, మనగుట్టు పొక్కదు," అనుకున్నారు.

ఒక దొంగ డబ్బునూ, నగలనూ రెండు భాగాలుగాచేసి, కొంచెం హెచ్చుగా ఉన్న భాగం తాను తీసుకోబోయాడు.

రెండోవాడు కుప్పలు కలిపేస్తూ, "నువ్వు నన్ను మోసం చేద్దామని చూస్తున్నావు. నన్ను పంచనీ," అన్నాడు.

వాడుకూడా సొమ్ము అంతా రెండు భాగాలు చేసి, ఎక్కువ ఉన్న భాగం తాను తీసుకోవటానికి ప్రయత్నించాడు. మొదటివాడు అభ్యంతరం చెప్పాడు.

ఇదంతా చూసిన మీదట ఇద్దరూ మోసగాళ్ళే నన్న విషయం మంగమ్మ బుర్రకు అందింది.

దొంగలు మంగమ్మ చేత పంపకాలు చేయించుకోవటానికి నిర్ణయించుకుని, "ఈ సొమ్ము సమంగా నువు పంచు. ఇందులో నీకు కొంత ఇస్తాం," అన్నారు మంగమ్మతో.

మంగమ్మ సరేనని తల ఊపి, వాళ్ళకు పక్కగది చూపించి, అక్కడ కూచోమని సైగచేసింది. వాళ్ళు గదిలోకి పోగానే ఆమె గది తలుపు గొళ్ళెంపెట్టి, తాళం కూడా వేసింది. తరవాత ఆమె కుంపటి రాజేసి, అందులో ఎండు మిరపకాయలు వేసి, తాను వసారాలోకిపోయి పడుకున్నది. దొంగలు కొరుకు సొమ్మసిల్లి పోయారు.

తెల్లవారుతూండగానే రంగయ్య తిరిగి వచ్చాడు. జరిగిన సంగతి భార్య నుంచి తెలుసుకుని, అతను రక్షకభటులను పిలుచుకు వచ్చి, దొంగలను పట్టిచ్చాడు. అందరూ మంగమ్మను మెచ్చుకున్నారు. దొంగలను పట్టినందుకు మంగమ్మకు బహుమతి కూడా లభించింది.



# అనర్హత

ఒక రాజుగారికి అంగరక్షకుణ్ణి నియమించే భారం మంత్రిగారి మీద పడింది. అంగరక్షకుడికి బుద్ధిబలమూ, కండబలమూ కూడా ఉండాలి. అసలే తగినవాడు దొరకక మంత్రి యాతన పడుతుంటే, మంత్రికి నచ్చినవాళ్ళు రాజుకు నచ్చలేదు.

ఈ స్థితిలో సేనాపతి మంత్రికి ఒక మనిషిని శిఫార్సుచేశాడు. ఆ మనిషి అర్హతలు మంత్రికి నచ్చాయి. వాణ్ణి రాజు ఎదట పెట్టుతూ మంత్రి, వాడి అర్హతలు అన్నీ రాజుకు చెబుతూ, "మన సేనాపతి కూడా ఈ మనిషిని అంగరక్షకుడి పదవికి ఎన్నిక చేశాడు," అన్నాడు.

వెంటనే రాజు, "వీడికి నిజంగా అర్హతలన్నీ ఉంటే సేనాపతి శిఫార్సు ఎందుకు చెయ్యవలసి వచ్చింది? వీడు అర్హుడు కాడు," అనేశాడు. —ఎమ్. వి. వి. సత్యనారాయణ.





# పనికిరాని హితబోధలు

చక్రధరపురంలో విష్ణుశర్మ అనే నిరుపేద ఉండేవాడు. అతని భార్య పరమ గయ్యాళి. మూలిగే నక్కమీద తాటి కాయ పడినట్టు, అసలే దారిద్ర్యంతో సతమతమవుతున్న విష్ణుశర్మను భార్య రోజూ తిట్టిపోస్తూ, ''నిన్ను కట్టుకున్నందుకు పడరానిపాట్లు పడుతున్నాను. పెళ్ళానికి తిండికూడా పెట్టలేని వాడివి ఏమని పెళ్ళి చేసుకున్నావు?'' అని సాధించేది.

భార్య అన్న మాటలలో నిజం ఉన్నదని గ్రహించి విష్ణుశర్మ, ఎవరినీ నిందించటానికి లేక, జీవితంమీద వైరాగ్యం పుట్టి, భార్యకు చెప్పకుండా ఇల్లు వదిలిపెట్టి, సన్యాసం పుచ్చుకున్నాడు.

సంసారి జీవితంకన్న సన్యాసి జీవితం ఎంతో సుఖమైనదని విష్ణుశర్మ గ్రహించాడు. దొరికినది తినటమూ, కళ్ళుమూసుకుని కూర్చోవటమూ తప్ప సన్యాసికి ఏ బాధ్యతాలేదు. ఈ రహస్యం తెలియక ఎంతోమంది సంసార్లు నరకప్రాయమైన జీవితం జీవిస్తున్నారనీ, వారందరినీ తన హితబోధలద్వారా ఉద్ధరించ వచ్చుననీ, ఆ విధంగా మానవజాతికి ఎంతో మేలు చేయవచ్చుననీ విష్ణుశర్మ నిర్ణయించుకున్నాడు.

అతను శ్రీపురం అనే గ్రామం వస్తూనే ఒక ఇంటిముందు అనేకమంది మనుషులు బారుగా నిలబడిఉండటం చూసి, నిలుచున్నవారిని ఎందుకు నిలుచున్నారని అడిగాడు.

''అయ్యా, ఈ ఇల్లు సుబ్బిశెట్టిగారనే వడ్డీవ్యాపారిది. ఆయన బంగారమూ, ఇతర వస్తువులూ తాకట్టు పెట్టుకుని అందరికీ అప్పులిస్తాడు. వడ్డీతోసహా బాకీ తీర్చగానే తాకట్టు విడిపించుకుని,

రాంబాబు

ఎవరి వస్తువు వాళ్లు తీసుకుపోవచ్చు,'' అన్నారు వాళ్ళు.

వెంటనే విష్ణుశర్మ సుబ్బిశెట్టి దగ్గిరికి వెళ్లి, ''అయ్యా, మీరు చేసేది ఘోరాతి ఘోరమైన పాపం. చచ్చిపోయేటప్పుడు ఈ డబ్బు వెంటరాదు," అని హితబోధ చేశాడు.

"ఏం సన్యాసివయ్యా నువ్వూ? ఈపాటి నాకు తెలీదని చెప్పవచ్చావా? డబ్బు సంపాదించలేనివాళ్లు సన్యాసులై, చచ్చు వేదాంతం చెబుతారు! నీకే డబ్బుంటే సన్యాసివి అయిఉండేవాడివేనా ?'' అని శెట్టి అడిగాడు.

అందులో నిజం ఉన్నదని విష్ణుశర్మకు అనిపించింది. ఇక ఎవరికీ డబ్బుగురించి హితబోధ చెయ్యకూడదని తీర్మానించు కున్నాడు.

మర్నాడు అతను ధర్మపురి చేరుతూ, అక్కడ నదిఒడ్డున దిగులుగా కూర్చుని ఉన్న ఒక మనిషిని చూసి, అతని విచారానికి కారణం అడిగాడు.

''అయ్యా, నేనూ, నా భార్యా పడవలో ఈ నదిదాటుతుంటే, మధ్యలో పడవ మునిగి నా భార్య చనిపోయింది. నేను ఈదుకుంటూ ఒడ్డుకువచ్చాను. నా భార్య లేకుండా ఎలాబతకాలో నాకు అర్థం కావటంలేదు,'' అని ఆ మనిషి ఏడవ సాగాడు.

ఆ మనిషికి వైరాగ్యం బోధించవచ్చు ననుకుని విష్ణుశర్మ అతనితో, ''నాయనా,



ఈ బంధుత్వాలు శాశ్వతం కాదు. నీ భార్య పోయిందని విచారిస్తున్నావు. ఇది అజ్ఞానం అని తెలుసుకోలేవా? ఒకవేళ నువే పోయి, నీ భార్య బతికితే ఆమె నీకోసం ఇంతగా ఏడ్చేది కాదేమో? ఆ మాట ఆలోచించావా?'' అన్నాడు.

ఆ మనిషి మండిపడి, ''నా భార్య సంగతి నీకు ఏంతెలుసునని ఆ కూత కూశావు? భార్యప్రేమ ఎలాఉంటుందో ఏమాత్రం తెలిసినా నువు ఇలా సన్యాసివి అవుతావా?'' అని విష్ణుశర్మను నానా మాటలూ అన్నాడు.

అందులోనూ నిజం ఉన్నదనిపించింది విష్ణుశర్మకు. ఇక హితబోధ చేసేటప్పుడు తనకు వైరాగ్యం కలిగించిన కారణాల మాట ఎత్తరాదని అతను నిశ్చయించుకున్నాడు.

తరవాత అతను చంద్రగిరి చేరి, అక్కడ ఒక కసాయివాణ్ణి చూశాడు. వాడు అప్పుడే ఒక మేకను చంపి, దాని చర్మం ఒలిచి, మాంసాన్ని జనానికి అమ్ముతున్నాడు.

విష్ణుశర్మ ఆ కసాయివాణ్ణి సమీపించి, ''నాయనా, జీవహింస మహాపాపం! నువు ఈ మేకను చంపి, దాని మాంసం అమ్ముతున్నావు. దీని ఫలితంగా వచ్చేజన్మలో భగవంతుడు నిన్ను మేకగా పుట్టించి, ఈ మేకను కసాయివాడుగా పుట్టించి, ఇప్పుడు నువు మేకను చేసినట్టే దాని చేత నిన్ను చేయిస్తాడు,'' అన్నాడు.

ఆ మాటలకు కసాయివాడు గట్టిగా నవ్వి, ''ఓరి పిచ్చిసన్నాసీ! కిందటి జన్మలో నేను మేకను. ఈ మేక కసాయివాడు. నన్ను చంపింది. అందుచేత భగవంతుడు ఇప్పుడు నా చేత దాన్ని చంపించాడు,'' అన్నాడు.

వాడు చెప్పినది కాదనటానికి వీలు లేదని గ్రహించి విష్ణుశర్మ హితబోధలు చేసి, జనాన్ని మరామ్మతుచేసే పని మానుకున్నాడు.



# జ్యోతిష్కుడి ఎన్నిక

అవంతీ రాజు అస్థానంలో ఉండే జ్యోతిష్కుడు చనిపోయాడు. ఆ స్థానానికి అర్హుడు రామశర్మ ఉన్నాడు. అయినా రాజు నిష్పాక్షికంగా ఉన్నట్టు కనబడాలని, జ్యోతిష్కుడి ఎన్నికకోసం చాటింపు వేశాడు.

వందలకొద్దీ. జ్యోతిష్కులు రాజు వద్దకు వచ్చారు. రామశర్మ మాత్రం రాలేదు. రాజు రామశర్మకు కబురుచేసి పిలిపించి, "జ్యోతిష్కుడి ఎన్నికకు మీ రెందుకు రాలేదు?" అని అడిగాడు.

" నేను ఎన్నిక అవుతానని నాకు తెలిసేరాలేదు. తాము వచ్చినదారినే తిరిగి పోవలసివస్తుందని కూడా తెలుసుకోలేని ఈ జ్యోతిష్కులు, ఏం జ్యోతష్కులో నాకు అర్థం కాకుండా ఉన్నది," అన్నాడు రామశర్మ.

వచ్చిన జ్యోతిష్కులంతా తలలు వంచుకుని వెళ్ళిపోయారు. రామశర్మ అస్థాన జ్యోతిష్కుడుగా నియమించ బడ్డాడు.

—పి. వి. యస్సెస్సెన్రాజు



# పిందెను తుంచినవాడు

ఒక లోభి అయిన జమీందారు దగ్గిర సుందరమ్మ అనే వంటలక్క ఉండేది. ఆమె కొడుకు రాముడు తోటపని చేసేవాడు. తల్లి కొడుకులు జబ్బు పడితే సహాయం చెయ్యకపోగా. జీతం విరగకోసేవాడు జమీందారు.

జమీందారుకు కొంత బీడు భూమి ఉన్నది. అది సాగు చెయ్యాలంటే చాలా డబ్బు మదుపు పెట్టాలి. అందుకని లోభి జమీందారు దాన్ని బీడుగానే ఉండనిచ్చాడు. ఇరవై ఎకరాల ఆ బీడులో తనకు రెండెకరాలిస్తే సాగుచేసుకుంటా నని రాముడు అడిగితే జమీందారు ఒప్పుకో లేదు.

రాముడు జమీందారుతో ఒకనాడు, "నాకు తరచుగా కలవస్తున్నది. బీడులోని నల్లరాతికి దిగువన నిధి ఉన్నదిట. దాన్ని నన్ను తవ్వి తీసుకోనియ్యండి. దాంతో పొలం కొనుక్కుంటాను," అన్నాడు. జమీందారు దానికి ఎంత మాత్రమూ ఒప్పుకోక, "ఆ నిధి తీసి నాకు ఇయ్యి. రెండెక రాలు నేనే ఇస్తాను," అన్నాడు.

రాముడు ఒక కుండలో గాజు పెంకులునింపి, దానిమీద మూతతాపటం చేసి, తాను చెప్పిన చోట పాతిపెట్టాడు. దానిమీద, "ఇది దొరికిన అయిదేళ్ళకు తెరవాలి. లేకపోతే పిందెను తుంచినవాడి గతి అవుతుంది," అని రాశాడు. తరవాత జమీందారు సమక్షంలో వాడు దాన్ని తవ్వి తీసి జమీందారుకు ఇచ్చాడు. కుండను అయిదు సంవత్సరాల అనంతరం తెరుద్దామని జమీందారు దాన్ని భద్రపరచి, రాముడికి రెండెకరాలు ఇచ్చేశాడు. రాముడు కష్టపడి పనిచేసి ఆ భూమి ఆధారం మీద పైకి వచ్చాడు.

జమీందారు కొడుకు తన సొంత ఖర్చుకోసం తండ్రి నుంచి డబ్బు రాబట్టలేక, తండ్రికి తెలియకుండా ఆ నిధి తెరిచాడు. అందులో గాజు పెంకులున్నాయి.

"పిందెను తుంచినవాడి గతి అంటే ఇదే కాబోలు!" అనుకున్నాడు జమీందారు.





# మహిషాసుర మర్దిని

ఒకప్పుడు రాక్షసులకు రాజుగా ఉండిన మహిషాసురుడు కోరినప్పుడు భయంకర మైన దున్నపోతుగా మారేవాడు. వాడు క్రూరుడూ, జయించరాని వాడూనూ.



వాడు వందవీళ్లపాటు దేవతలను హింస పెట్టి, వారిని స్వర్గం నుంచి తరిమాడు. వారు భూమి మీద తల దాచుకున్నారు.



కొందరు దేవతలు త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల వద్దకు వెళ్లి, మహిషాసురుడు చచ్చే మార్గం చూడమన్నారు.


త్రిమూర్తుల క్రోధానలం ఉవ్వెత్తున జ్వాలగా లేచింది. అందులో
నుంచి దుర్గ ఉద్భవించింది. శివుడు తన శక్తితో ఆమెకు ముఖం
ఇచ్చాడు. యముడు కేశాలు ఇచ్చాడు. విష్ణు ఆమెకు నాలుగు
చేతులిచ్చాడు. బ్రహ్మ ఆమెకు కాళ్ళూ, అగ్ని త్రినేత్రాలూ,
తదితర దేవతలు ఆమెకు ఆభరణాలూ, ఆయుధాలూ ఇచ్చారు.

ఆమె రాక్షసుల పైకి బయలుదేరింది. ఆ సంగతి తెలిసి రాక్షసులు ఆమెతో పోరాటానికి సిద్ధమయారు. అయితే దేదీప్యమానమైన ఆమె ఆకారాన్ని చూసి బెదిరి, వారు తమ నాయకుడి వద్దకు పరిగెత్తారు.





రాక్షస సేనాపతులు తమ బలాలను దేవి పైకి పంపారుగాని, వారిలో చాలా మంది దేవి వాహనమైన సింహానికీ, దేవి చేతిలోని త్రిశూలానికీ బలి అయారు.



తన సేనలూ, సేనాపతులూ చచ్చారని విని మహిషాసురుడు మండిపడి, అడవి దున్న రూపు ధరించి, దుర్గ పైకి వెళ్లాడు. ఆమె వెంటనే అతని శిరస్సు ఖండించింది.



అప్పుడు మహిషాసురుడు ఏనుగురూపం ధరించి, దుర్గకు వాహనమైన సింహాన్ని పట్టుకోబోయాడు. దేవి ఏనుగు తొండాన్ని నరికింది.



అప్పుడు మహిషాసురుడు తన అసలు రూపంలో దేవిని ఎదుర్కొన్నాడు. దేదీప్యమానమైన ఆమె విగ్రహం అతని కళ్ళు చెదిరేటట్టు చేసింది. అతను ఎంతోసేపు పోరాడలేక పోయాడు.



దేవి సింహంతో సహా రాక్షసుడి పైకి లంఘించి, వాణ్ణి తన త్రిశూలంతో హతమార్చింది. అంతటితో మూడులోకాలకూ శాంతి లభించింది.



# మోసంలో నిజాయితీ

సుబ్బుడిది నవరంగపురం. వాడు ఏదో పనిమీద దూరగ్రామం వెళ్లాడు. అక్కడ ఒకరోజుండి, తన పని చూసుకొని, మర్నాడు తన గ్రామానికి బయలు దేరాలంటే ఒక గుర్రపుబండీగాని, ఎడ్లబండీగాని దొరకలేదు. దారిలో ఏదో ఒక బండీ దొరక్కపోతుందా అని వాడు కాలినడకన బయలుదేరాడు.

వాడు కొంత దూరం వెళ్ళేసరికి అల్లంతదూరాన ఖాళీగుర్రపు బండి కనిపించింది. గుర్రం ఒక చెట్టుకు కట్టి ఉన్నది. బండితోలేవాడు బండి కింద కునుకు తీస్తున్నాడు. మరో పెద్దమనిషి చెట్టునీడలో నిద్రపోతున్నాడు. సుబ్బుడు దగ్గిరికి వచ్చిచూసి, హతాశుడై పోయాడు. చెట్టుకింద పడుకున్నవాడు తమ ఊరి పైడిశెట్టే! బండీ అతనిదే. పైడిశెట్టి పిసినారిమాత్రమే కాదు, తనకన్న తక్కువ వాళ్ళను బండిలో ఎక్కనియ్యడు; ఎక్కనిచ్చినా వాళ్ళదగ్గర హెచ్చు కిరాయి వసూలుచేస్తాడు. అందుచేత తనకు ఆ బండిలో వెళ్ళే అవకాశం లేదనుకుని, సుబ్బుడు ముందుకు సాగిపోయాడు. కాని వాడికి ఒక ఆలోచన వచ్చింది. దాన్ని వాడు అమలుపరిచాడు.

తరవాత కొద్దిసేపటికి దూరాన గుర్రం సకిలింపు వినిపించింది. వెంటనే పైడిశెట్టి బండితోలేవాడు వెంకన్న లేచిచూస్తే తమ గుర్రం గడ్డిమేస్తున్నది. వెంకన్న మళ్ళీ పడుకున్నాడు. అంతలో దూరాన గుర్రం సకిలించటం మళ్ళీ వినిపించింది. ఈసారి పైడిశెట్టి గుర్రం తానుకూడా సకిలించింది. ఈసారి వెంకన్న లేచి కూర్చున్నాడు.

అదే సమయంలో గుర్రపుడెక్కల చప్పుడు కొద్దిగా వినిపించింది. సుబ్బుడు

శింగిశెట్టి సంజీవరావు

పరిగెత్తుకుంటూ వచ్చి, పైడిశెట్టిని లేపి, హడావుడిగా "అమ్మ బాబోయ్! దొంగలు! ఆ పక్క అడవిగుండా గుర్రాల మీద వస్తున్నారు. బండికట్టి త్వరగా కదలండి!" అన్నాడు.

క్షణంలో వెంకన్న బండి కట్టాడు. సుబ్బడు శెట్టిని బండిలోకి తోసి, వెనక తానుకూడా ఎక్కాడు. కొరడాదెబ్బలు తిని శరవేగంతో గుర్రం పరుగుతీసింది. సుబ్బడు ఎక్కినందుకు అభ్యంతరం చెప్పాలని ఆ క్షణంలో శెట్టికి తోచలేదు. ఆతని మనసులో దొంగల భయంతప్ప ఇంకేమీ లేదు.

బండి నవరంగపురం చేరగానే సుబ్బడు బండి దిగాడు. శెట్టి గట్టిగా ఊపిరి పీల్చి, తనసొమ్ము సంచీని ఇంట్లోకి తీసుకుపోయి భద్రపరిచాడు.

తరవాత వెంకన్న గుర్రాన్ని విప్పి, కొట్టంలో కట్టి, దానికి దాణా పెట్టి, బండిని పెట్టెసేముందు శుభ్రం చేస్తుండగా అందులో ఒక చిన్న మూట కనబడింది. అది శెట్టిగారు మరిచాడనుకుని, వెంకన్న దాన్ని తీసుకుపోయి తన యజమానికి ఇచ్చాడు.

శెట్టి మూట విప్పిచూస్తే అందులో చిల్లరడబ్బులూ, ఒక చీటీ ఉన్నాయి. అందులో ఇలా రాసి ఉన్నది:

"శెట్టిగారూ, నన్ను మీరు క్షమించాలి. నేను మన ఊరు చేరుకోవటానికి బండి దొరకలేదు. మీ బండిలో రావటానికని నాకు చేతనైన విద్య ఉపయోగించాను. నేను కుక్కల ఘొరుగూ, నక్కల ఊళా, గుర్రాల సకిలింపూ, డెక్కల చప్పుడులాటి ధ్వనులు నోటితో చేయగలను. నా విద్య సహాయంతో, దొంగలు వస్తున్నారని మిమ్మల్ని నమ్మించి మోసగించి, మీ బండిలో ఊరు చేరుకున్నాను. అయినా మీ రుణం ఉంచుకోను. మీరు మామూలుగా వసూలుచేసేటంత బాడుగ ఇచ్చుకోలేకపోయినా, న్యాయమైన కిరాయి డబ్బులు ఇందులో ఉంచాను, స్వీకరించండి."



# ఏక లక్ష్యం

వరరుచి కొడుకులు అనేక కులాల స్త్రీలకు పుట్టిన వాళ్ళు. వారిలో హీనజాతివాడు తన అన్న అయిన బ్రాహ్మణుడి దర్శనం కోసం వచ్చి, శ్రాద్ధంనాడు తప్ప వాడికి ఆ ఇంట ప్రవేశం లేదు గనక, ఇంటి ఎదురుగా ఉన్న నది తాలూకు ఇసుకలో నిలబడి తన అన్న ఏం చేస్తున్నాడని అడిగాడు.

"విష్ణు పూజలో ఉన్నారు," అని చెప్పాడు ఇంటి నౌకరు. తక్కువ కులంవాడు ఇసుకలో గొయ్యి తవ్వుతూ కూర్చున్నాడు. మరి కొంత సేపటికి నౌకరువచ్చి, తన యజమాని శివపూజ చేస్తున్నట్టు చెప్పాడు. తక్కువ జాతివాడు ఇంకోగుంట తవ్వ నారంభించాడు.

ఇలాగే బ్రాహ్మణ అన్న ఒకసారి దుర్గను పూజిస్తున్నాడనీ, మరోసారి హనుమంతుణ్ణి పూజిస్తున్నాడనీ, కుమారస్వామిని పూజిస్తున్నాడనీ వార్తలు వచ్చాయి.

చిట్ట చివరకు బ్రాహ్మడు బయటికి వచ్చి ఇసుకలో చాలా గుంటలు చూసి, "ఏమిటి ఇవన్నీ?" అని అడిగాడు.

"నీటి కోసం తవ్వాను," అన్నాడు తమ్ముడు.

"మూఢుడా. ఒక్కగుంట తవ్వితే ఎప్పుడో నీరు పడేదికదా?" అన్నాడు అన్న.

"మూఢుడా, నువు అంతమంది దేవతలను పూజించక ఏ ఒక ఇష్టదేవతనో అర్చించితే, ఎప్పుడో తరించేవాడివి గద!" అన్నాడు తమ్ముడు. —నాయర్.





# మనిషికి కవచం

పందిరి మంచం కొనమని గురవయ్యను అతని భార్య ఎంతో కాలంగా పోరుతున్నది. వెల చాలా అవుతుందని గురవయ్య సంకోచిస్తూ వచ్చాడు. ఇంతలో, చనిపోయిన జమీందారుగారి పందిరి మంచం వేలంలో అమ్మకానికి వచ్చింది. జమీందారు కొడుకు తన మకాం బస్తీకి మార్చుతూ, భారీసామగ్రి అంతా అమ్మేస్తున్నాడట.

ఆ పందిరి మంచాన్ని గురవయ్య చవగ్గా కొనేసి, ఇంటికి తెచ్చాడు. మూడు నెలలు గడిచాయి. మంచం బాగున్నది గాని, దానికి బిగించిన అద్దం పాతబడి, మెరుగుపోయి, కొంత పగులు చూపింది కూడా. దానికి బదులు కొత్త అద్దం వేద్దామని, గురవయ్య ఆ పాతఅద్దాన్ని ఊడబీకేసరికి, దాని వెనకఉన్న రహస్యపు అరలో బంగారు నాణాలు కనిపించాయి.

"అవి పట్నంలో ఉన్న జమీందారు కొడుకువి. పరుల సొమ్ము పాముతో సమానం. ఆ డబ్బు పట్నం తీసుకుపోయి, జమీందారు కొడుకును వెతికి పట్టుకుని, ఇచ్చేసిరా," అన్నది గురవయ్య భార్య.

గురవయ్య బంగారం తీసుకుని పట్నం చేరేసరికి చాలా పొద్దుపోయింది. ఆ రాత్రికి ఎవరింటనో తలదాచుకుని, మర్నాడు జమీందారు కొడుకు గురించి చూడవచ్చునని అతను అనుకున్నాడు.

ఆ రాత్రి గురవయ్యకు ఆశ్రయం ఇచ్చినవాడు శేషాచలం అన్న గృహస్థు. శేషాచలం కుటుంబం ఒకప్పుడు బాగా బతికి, చితికిపోయినట్టు కనబడింది.

గురవయ్య అడిగినమీదట శేషాచలం తనకు దైవికంగా వచ్చిపడిన కష్టాలను గురించి చెప్పాడు. చేతి కందివచ్చిన ఇరవైఏళ్ళ కొడుకు మంచానపడి, చాలా

మాచిరాజు కామేశ్వరరావు

కాలం తీసుకుని చనిపోయాడు. అతనికి వైద్యం చేయించటానికి శేషాచలం చాలా ఖర్చు చేశాడు. ఇది జరిగిన కొద్దికాలానికే అతని బట్టలదుకాణం కాలిపోయింది. అప్పులు తీరటంకోసం ఇంటి సామానూ, ఇల్లూకూడా అమ్మేశాడు శేషాచలం.

"రేపు మేం ఈ ఇల్లు ఖాళీచెయ్యాలి. ఇంకా నేనూ, నా భార్యా మా చిన్న కొడుకు మీద ఆశలన్నీ పెట్టుకుని ఉన్నాం," అని చెప్పాడు శేషాచలం.

శేషాచలం పరిస్థితి గురించి ఆలోచించినకొద్దీ గురవయ్యకు నిద్రపట్టలేదు. చిట్టచివరకుఅతను,జమీందారుబంగారం శేషాచలానికి ఇచ్చి, తరవాత జమీందారు కొడుక్కు తెలియజేయా లనుకున్న మీదట అతనికి కునుకు పట్టింది. కాని త్వరలోనే అతనికి నిద్రాభంగమయింది.

ఒక ముసుగుమనిషి శేషాచలం కొడుకు పీకకు కత్తి ఆనించి, "నీ డబ్బంతా ఎక్కడ దాచావో చెబుతావా? వీడి పీక తెగనరకమన్నావా?" అని శేషాచలాన్ని బెదిరిస్తున్నాడు.

"కుర్రవాణ్ణి ఏమీ చెయ్యకు. నిజంగానే నా దగ్గిర చిల్లిగవ్వలేదు," అంటూ ఏడుస్తున్నాడు శేషాచలం.

గురవయ్య ముసుగుమనిషితో, "నా దగ్గిర సంచీలో డబ్బున్నది. ఆ కుర్రాణ్ణి




వదిలేసి, సంచీలో డబ్బు పట్టుకుపో," అన్నాడు.

ముసుగుమనిషి గురవయ్య దగ్గిర ఉన్న గుడ్డసంచీలోని బంగారు నాణాలు తీసుకుని, తృప్తిపడి, వాటితో చీకట్లోకి జారుకున్నాడు.

"దేవుడిలా మా పిల్లవాణ్ణి కాపాడారు. మాకున్న భవిష్యత్తు వాడే. మేం మీ ఋణం ఎలా తీర్చుకుంటామో తెలీదు," అన్నారు శేషాచలమూ, అతని భార్యా గురవయ్యతో.

"నేనే మీకు నా ఋణం తీర్చుకున్నానేమో. దాన్నిగురించి విచారించకండి," అన్నాడు గురవయ్య.

మర్నాడు తెల్లవారగానే అతను జమీందారు కొడుకు కోసం వెతుకుతూ బయలుదేరి, చివరకు ఎలాగైతేనేం, పట్టుకోగలిగాడు. చిక్కేం వచ్చిందంటే, అతన్ని ఎవరూ ఎరగరు. అతను, గురవయ్య అనుకున్నట్టు ఒక పెద్ద భవంతిలో కాక, మారుమూల పూరిపాకలో ఉంటున్నాడు.

గురవయ్య అతనితో జరిగినదంతా చెప్పి, "నేను మీకు డబ్బు బాకీపడ్డాను. జరిగినదానికి మీరు నన్ను క్షమించి, నెలకింత చొప్పున డబ్బు తీసుకోవటానికి అంగీకరించాలి." అని వేడుకున్నాడు

అంతా విని జమీందారు కొడుకు, "నేను పట్నంరావటం పెద్ద పొరపాటయింది. పల్లెలో ఉండగా పట్నంజీవితం ఎంతో బాగా ఉన్నట్టు తోచింది. ఇక్కడ ఎంతడబ్బయినా సంపాదించవచ్చు ననుకున్నాను. ఇక్కడ అందరూ మోసగాళ్లే! నన్ను ఒక పెద్దమనిషి ఓ వ్యాపారంలోకి దింపి, తరవాత వ్యాపారం దివాలా తీసిందని చెప్పి, నన్ను ఈ పాకలో చేర్చి తాను మిద్దెకట్టుకున్నాడు. బతికేదారిలేక, పల్లెకు తిరిగి రావాలంటే మొహం చెల్లక, దొంగతనానికి పాల్పడ్డాను. నిన్నరాత్రి నేను దొంగిలించినది నాడబ్బే! నీలాంటి ఉత్తములు పల్లెలో తప్ప పట్నంలో ఉండరు. నేను మన పల్లెకు తిరిగివస్తాను." అన్నాడు పశ్చాత్తాపంతో.

గురవయ్య నవ్వి, "మంచివాళ్ళూ, చెడ్డవాళ్ళూ ప్రతి చోటా ఉంటారు. పట్నంలో శేషాచలంలాంటి సజ్జనులు లేరా? మనిషికి తృప్తి అనేది కవచం లాటిది. అది ఉంటె మనిషి ఎక్కడ ఉన్నా సుఖపడవచ్చు. అది లేనప్పుడు కష్టాలకు గురి అవుతాడు. మీకు అదే జరిగింది. శేషాచలం తాత్కాలికంగా కష్టపడినా, అతనికి మంచి రోజులు తప్పక వస్తాయి." అన్నాడు.

ఆ సాయంత్రమే అతను జమీందారు కొడుకును వెంటబెట్టుకుని, తన ఊరికి వచ్చేశాడు.





# పవిత్రజలం

మోతీపూరు గ్రామానికి నీటి ఎద్దడి ఉండేది. గ్రామంలో ఒక చెరువు ఉండేది గాని, అది చాలా పాతది; చాలాభాగం పూడిపోయింది. గ్రామాన్ని పాలించే జమీందారు ఎక్కడో అయిదు ఊళ్ళ అవతల ఉండి, మోతీపూరు గురించి పట్టించుకునేవాడు కాడు. అయన ఆసక్తి శిస్తులు వసూలు చెయ్యటం వరకే ఉండేది.

ఈ స్థితిలో ఊరి పెద్దలు కూర్చుని, నీటి సమస్య గురించి చర్చించారు. గ్రామం ఇంతగా పెరగక మునుపు శ్మశానం ఒకటి ఊరినానుకుని ఉండేది. ఊరు విపరీతంగా పెరగటంతో ఊరివాళ్లు శ్మశానాన్ని దూరంగా జరిపి, పాత శ్మశానాన్ని ఊరి మధ్య బీడుగా వదిలారు. అక్కడ తవ్వితే మంచి చెరువు ఏర్పడుతుంది. శ్మశానం అంటే ప్రేతభూమి కదా, అక్కడ చెరువు తవ్వటమేమిటని కొందరు అనుకోకపోలేదు.

పంటల తరుణంలో చందాలు వేసి, పాత శ్మశానంలో తవ్వకం ప్రారంభించారు. అయితే డబ్బు చాలక, మధ్యలో పని నిలిచిపోయింది. ఈ లోపల పాత జమీందారు చనిపోయి, అతని కొడుకు జమీందారు అయాడు. ఇతను తండ్రి లాటివాడు కాడు; మోతీపూరు గ్రామస్థులు వచ్చి తమ గోడు చెప్పుకుంటే, వాళ్లకు కావలసిన ధనసహాయం చేసి పంపాడు. గ్రామస్థులు కొత్త చెరువును అతని పేర హరిసాగరం అని పిలుస్తామంటే, తన తండ్రి పేర రామసాగరం అని అతను పిలవమన్నాడు.

వెళ్ళిన పని సక్రమంగా ముగించుకుని గ్రామస్థులు తమ గ్రామానికి తిరిగివచ్చి, వానలు ప్రారంభమయే లోపల అతి

ఏ. సి. సర్కార్, ఐంద్రజాలికుడు

వేగంగా తవ్వకం పని కొనసాగించారు. చెరువు తవ్వటం పూర్తి అయింది. దాని అడుగు భాగంలో నాలుగు మూలలా నాలుగు బావులు తవ్వటానికి ఉపక్ర మించారు. మూడు బావులు పూర్తి అయి, నాలుగోది తవ్వుతూండగా పై నుండి మట్టి పెళ్ళలు విరిగి, కూలీల పైన పడి, వాళ్ళు మరణించారు.

ఊరివాళ్ళకు ఇది పెద్ద అపశకునంగా తోచింది. "శ్మశానంలో చెరువు తవ్వితే ఇలా కాక ఏమవుతుంది ? ఇది దయ్యాల భూమి అని ప్రత్యక్షంగా రుజువయింది గద!" అన్నారు కొందరు.

వానలు కురిసి రామసాగరం స్వచ్ఛ మైన నీటితో నిండింది. అందులో కలువలూ, తామరలూ పూసి చెరువు కళకళలాడింది. కాని జనం దాని చాయలకు పోలేదు. రెండు ఏళ్ళు గడి చాయి. చెరువు నిండా, చెరువు గట్లనా నాచు మొక్కలూ, పిచ్చి మొక్కలూ మొలిచాయి.

జమీందారు హరిశంకరుడికి తారా నాధుడనే ఇంద్రజాలం తెలిసిన మిత్రుడు ఉండేవాడు. ఒకసారి హరిశంకరుడు తారానాధుడికి రామసాగరం గురించి చెప్పాడు.

"విచారించకు, మిత్రమా ! పల్లెప్రజలు మూఢ విశ్వాసాలు నమ్మినట్టే అద్భుతాలూ నమ్ముతారు. మనం ఏదో ఒక అద్భుతం చేసి చూపుదాం. చెరువుకు మెట్లూ



అవీ కట్టి ఉన్నాయా ?" అని తారా నాధుడు అడిగాడు.

"ఒక మెట్లే కాదు, శివాలయం కూడా కట్టించాను. విగ్రహ ప్రతిష్ఠ మాత్రం జరగలేదు, అంతే!" అన్నాడు జమీందారు.

"భేష్! అలా అయితే చెరువులో నాచూ, గట్ల మీద మొక్కలూ తీయించి శుభ్రం చేయించు. కామరూప నుంచి తారానాధు డనే తంత్రవేత్త వచ్చి ఫలానా రోజున ఆలయంలో విగ్రహ ప్రతిష్ఠ చేయబోతున్నాడని ప్రకటించు. ఈ తంత్ర వేత్త రామసాగరాన్ని ఆవహించిన పిశాచా లన్నిటినీ తరిమి కొట్టి, వచ్చే పూర్ణిమ నాడు తటాకజలాన్ని అమృతప్రాయంగా చెయ్యబోతున్నాడని జనానికి చెప్పు," అన్నాడు తారానాధుడు.

విగ్రహ ప్రతిష్ఠకు ఏర్పాట్లన్నీ పూర్తి అయాయి. తారానాధుడు తాంత్రికుడి వేషం ధరించి మోతీపూరు వచ్చి, ఒక రోజు ముందుగా దేవాలయంలో దిగాడు. జమీందారు మనుషులు అతని సౌకర్యాలు చూశారు. పూర్ణిమనాడు జమీందారుగారి పురోహితుడు వచ్చి ఆలయంలో విగ్రహ ప్రతిష్ఠ శాస్త్రోక్తంగా జరిపాడు. ఆ ఉత్సవం చూడటానికి ఊరి ప్రజలు అధిక సంఖ్యలో వచ్చారు. జనాన్ని ఆకర్షించటానికి వాద్య సంగీతం వగైరా ఏర్పాటయాయి.

చెరువు నీరు ఇప్పుడు నిర్మలంగానూ, ఆకర్షవంతంగానూ ఉన్నది. కాని జనానికి





దాన్ని చూస్తే భయం పోలేదు. తారానాథుడు ఎర్ర బట్టలూ, మూరెడు గడ్డమూ ధరించి, ఆలయం నుంచి చెరువు ఒడ్డుకు, జనం వద్దకు వచ్చాడు. అతను వారితో, "మిత్రులారా, మీరనుకున్నది నిజం. ఇది దయ్యాలు నివసించిన చోటే. నేను యోగదృష్టితో ఆ సంగతి గ్రహించాను. అయితే భూతనాథుడైన శివుణ్ణి ఆలయంలో ప్రతిష్ఠించగానే దయ్యాలన్నీ పారిపోయాయి. ఇంతకాలమూ దయ్యాల కారణంగా అపవిత్రంగా ఉండిన ఈ చెరువు నీటిని పవిత్రం చెయ్యటానికి ఒక క్షణంపాటు నేనీ నీటిని అమృతప్రాయంగా చేస్తాను. అటు తరవాత శివుడి రక్షణలో ఉండే ఈ నీటిని మీరు యథేచ్ఛగా ఉపయోగించుకోవచ్చు. ఇదుగో చూడండి!" అన్నాడు.

ఇలా అంటూ తారనాథుడు దేవాలయంలోకి వెళ్ళి ఒక నాటు చిప్ప గరిటెతో తిరిగి వచ్చాడు. గరిటె చిప్ప టెంకాయ చిప్ప. దానిలోకి ఒక లోహపు కడ్డీ దూర్చారు. అతను కొద్దిమంది గ్రామస్థులను వెంటబెట్టుకుని నీటి వద్దకు వెళ్ళి, తన గరిటెతో కొంత నీరు తీసి, అందరి చేతుల్లోనూ తలా కాస్తా పోసి, ఎలా ఉన్నదీ చెప్పమన్నాడు. వాళ్ళు నీటిని వాసన చూసి, ఏ వాసనా లేదన్నారు.

తారానాథుడు సంస్కృతంలో శివ స్తోత్రం గట్టిగా చదివి, మళ్ళీ గరిటెలో నీరు తీసి, దగ్గిర ఉన్న వారి చేతుల్లో తలా కాస్తా పోసి, "ఈ సారి వాసన చూసి, తరవాత రుచి చూసి, ఎలా ఉన్నదీ చెప్పండి," అన్నాడు. వాళ్ళు దాన్ని వాసన చూసి, వెంటనే భక్తితో కళ్ళకద్దుకుని తాగేశారు.

"ఎలా ఉన్నది?" అని తారానాథుడు అడిగితే వాళ్ళు, "దివ్యమైన వాసన! అమృతంలాగున్నది!" అన్నారు. తారానాథుడు చెప్పిన మీదట వాళ్ళు పిశాచాల భయం లేకుండా, చెరువులోకి దూకి, ఈది, స్నానాలు చేశారు. రామసాగరం

గ్రామస్థులకు పవిత్రమయిపోయింది. గ్రామానికి నీటి ఎద్దడి తొలగింది.

తరవాత జమీందారు తారానాథుణ్ణి, "మిత్రమా, నువు గొప్ప అద్భుతమే చేశావు. కాని ఎలా చెయ్యగలిగావు?" అని అడిగాడు.

తారానాథుడు తన పెట్టెలో నుంచి కొబ్బరి చిప్ప గరిటె పైకి తీసి, "దీని కాడ చూడు, ఇది నిజానికి గొట్టం. దీని లోపల డొల్ల. చిప్పలో నుంచి దూర్చిన దీని చివర శాశ్వతంగా మూసి ఉంటుంది. నా చేతిలో ఉన్న చివర రబ్బరు బిరడాతో గాలి పోకుండా మూసి, దానికి రంగు వేసి లోహంలాగా కనబడేలాగు చేశాను. కాడ చిప్ప మధ్యన చూడు, దాని దిగువ భాగంలో రంధ్రం ఉన్నది. నా చేతితో పట్టుకునే చోట ఇంకో రంధ్రం ఉన్నది. దాన్ని నా బొటన వేలితో మూసి ఉంచుతాను. ఇంద్రజాలం చేయటానికి ముందు నేను ఈ కాడలో అమర్చిన రబ్బరు బిరడా తీసి, గొట్టం తాలూకు రెండు రంధ్రాలను వేళ్ళతో మూసి, గొట్టంలో నీరు నింపాను; ఆ నీటిలో గంధమూ, కస్తూరీ, తేనే చేర్చాను. తరవాత రబ్బరు బిరడా దాని స్థానంలో పెట్టేశాను. తరవాత రంధ్రాల మీది నుంచి ఎడమ చేతి వేళ్లు తీసేసి, కాడను పట్టుకునే చోట ఉన్న రంధ్రాన్ని కుడి బొటనవేలితో మూశాను. అలా గరిటెను పట్టుకుని గుడి నుంచి బయటికి వచ్చి అద్భుతం చేశాను. గరిటెను మొదటిసారి నీటిలో ముంచినప్పుడు నా కుడి బొటనవేలు రంధ్రం మీదనే ఉన్నది. అందుచేత ఆ నీరు మామూలు నీరులాగా, వాసన లేకుండా ఉన్నది. కాని రెండోసారి గరిటెను నీటిలో ముంచినప్పుడు రంధ్రం మీదినుంచి కుడి బొటనవేలు తీసేశాను. అందుచేత చిప్ప ప్రాంతంలో ఉన్న రంధ్రం నుంచి, గొట్టం లోని సువాసన నీరు చిప్పలోకి ప్రవహించింది. అందులో తేనె కూడా ఉండటం చేత ఆ నీరు మంచి వాసనా, రుచీ కలిగి ఉన్నది," అన్నాడు.





# ఏది గొప్ప విద్య?

రాజధానిలో విద్యాప్రదర్శనలు జరగబోతున్నాయి. ఎవరికి వచ్చిన విద్యను వారు ప్రదర్శించుకోవచ్చు. ఏ విద్యలోనైనా ప్రత్యేక ప్రావీణ్యం గల వారికి రాజుగారు బహుమతులూ, వార్షికాలూ ఇస్తారు. ఇలా చాటింపు వింటూనే అనేక గ్రామాల నుంచి అనేక మంది రాజధానికి బయలుదేరారు.

రామశాస్త్రి పండితుడూ, హరికథలు చెప్పటంలో గట్టివాడూనూ. ఆయన తన విద్యను ప్రదర్శించటానికి రాజధానికి బయలుదేరాడు. ఆయనతోబాటు విలువిద్యలో ఆరితేరిన సుధన్వుడు కూడా బయలుదేరాడు.

ఇద్దరూ బయలుదేరుతూ కర్రసాము బాగా చేయగల వీరయ్యను తమతో రమ్మన్నారు. "నీ విద్య చూసి రాజుగారు బహుమతి ఇచ్చినా ఇయ్యవచ్చు. లేకపోయినా విద్యా ప్రదర్శనలు చూసి ఆనందించవచ్చు. ప్రయాణం సరదాగా సాగటానికి ఇద్దరికన్న ముగ్గురు నయం." అన్నారు వాళ్ళు వీరయ్యతో. వీరయ్య వారితో బయలుదేరాడు.

పూటకొకరు వంట చేస్తూ ప్రయాణం చేశారు. ఒకనాడు అడవి దారిన ప్రయాణం చేస్తూండగా, ఏ విద్య గొప్పది అన్న చర్చ వచ్చింది.

"అన్ని విద్యలలోకీ నిస్సందేహంగా విలువిద్యే గొప్పది. వందగజాల దూరాన ఉన్న శత్రువును గాని, ఎగిరే పక్షినిగాని గురిగా కొట్టగలను. ఒంటరిగా అడవిలో వదిలినా, వేటాడి జీవించగలను! అందుచేత అన్ని విద్యలలోకీ విలువిద్యే గొప్పది." అన్నాడు సుధన్వుడు.

రామశాస్త్రి ఒప్పుకోక, "నీ విద్య అడవులలో పనికివస్తుందేమో గాని,

గుంటక సాంబిరెడ్డి

మనుషుల మధ్య పనికిరాదు. మామూలు జీవితంలో మనుషులకు ఉల్లాసం కలిగించి, కష్టాలు మరిచిపోయేటట్టు చేసి, ఇహమూ, పరమూ కూడా దక్కేటట్టు చేయగలది నా విద్య! నా హరికథ విని ఆనందించని మనిషిని నే నింతవరకూ చూడలేదు. అందరికీ ఆనందం కలిగించేదే గొప్ప విద్యగాని, ఎంత ప్రావీణ్యం వున్నా, నీ విలువిద్యే గొప్పదంటే ఒప్పుకోను,'' అన్నాడు.

ఇంతలో వీరయ్య కల్పించుకుని, ''ఎందుకు పోట్లాడుకుంటారు? అన్ని విద్యలూ గొప్పవే. ఏ విద్య అయినా సమయాన్నీ, సందర్భాన్నీ బట్టి మాత్రమే రాణిస్తుంది. ఒక విద్య ఎక్కువా, మరొకటి తక్కువా అనుకోవటం అవివేకం,'' అన్నాడు.

''అంటే, నీ విద్య కూడా మా విద్యలతో సమానమేననా ఏమిటి నీ ఉద్దేశం? మా విద్యలలో ఏది గొప్పదో మేం తరవాత తేల్చుకుంటాంగాని, నీ విద్య మాత్రం మా విద్యల ముందు దిగదుడుపే!'' అన్నారు సుధన్వుడూ, రామశాస్త్రీ ఏకకంఠంగా.

''మీతో నేను వాదించ దలచలేదు. ఈ పూట వంట ప్రారంభించుదాం. ఇక్కడేదో చెరువున్నట్టున్నది,'' అన్నాడు వీరయ్య.

ఆ పూట వంట బాధ్యత వీరయ్యది. అతడు వంటకు ఉపక్రమించగానే



మిగిలిన ఇద్దరూ ఒక్క క్షణం అడవి చూసి వస్తామని బయలుదేరారు. వాళ్ళు అడవి లోని వింతలూ, దాని వింత సౌందర్యమూ చూసి, మహదానంద పడిపోతూ కొద్ది దూరమే వెళ్ళారు.

తరవాత కొద్దిసేపటికే రామశాస్త్రి ఆర్త నాదాలు వీరయ్యకు వినిపించాయి. వీరయ్య తల ఎత్తి చూసేసరికి, దూరాన రామశాస్త్రీ, సుధన్వుడూ, వాళ్ళను చుట్టు ముట్టి దౌర్జన్యం చేస్తున్న నలుగురు దొంగలూ కనిపించారు.

రామశాస్త్రి చమత్కార సంభాషణ దొంగలను ముగ్ధుల్ని చేసినట్టు లేదు. దొంగలు మరీ దగ్గిర కావటంతో సుధన్వుడి విలువిద్యా పాటవం నిరుపయోగమయి నట్టున్నది.

వీరయ్య బాణాకర్ర తీసుకుని, పరి గెత్తుకుంటూ వెళ్ళి, దొంగలమీద కలియ బడ్డాడు. దొంగలు మిగిలిన ఇద్దరినీ వదిలి వీరయ్య మీద పడబోయారు. కాని కర్ర తిప్పటంలో వీరయ్య ధాటికి దొంగల తలలు బద్దలైనంత పని అయి వాళ్ళు కాలిసత్తువ కొద్దీ అడవిలోకి పారి పోయారు.

రామశాస్త్రీ, సుధన్వుడూ సిగ్గుపడుతూ, "వీరయ్యా, ఇవాళ నువు లేకపోతే ఆ దొంగలు మా ప్రాణాలు తీసి ఉండే వాళ్ళు. అజ్ఞానం కొద్దీ మా విద్యలే గొప్పవని విర్రవీగాం. అహంకారం కొద్దీ మేం మాట్లాడినందుకు క్షమించు. నిస్సం దేహంగా నీ విద్యే మా విద్యల కంటె గొప్పది," అన్నారు.

"అలాటిదేమీ లేదు. ఏ విద్య అయినా సమయాన్నిబట్టీ, సందర్భాన్నిబట్టీ రాణి స్తుందని ముందే చెప్పానుగద! మన విద్యలను చూసి మనం గర్వపడరాదు. ఇంకోరి విద్యను తక్కువ చేయరాదు," అన్నాడు వీరయ్య.

తరవాత ముగ్గురూ రాజధానికి వెళ్ళి తమ విద్యలు ప్రదర్శించి, తమతమ సామర్థ్యాలకు తగినట్టుగా రాజుగారినుంచి బహుమతులు పుచ్చుకున్నారు.






# దేవీ భాగవతం

నైమిశారణ్యంలో ఉండే మునులకు సూతుడు, తాను వ్యాసుడి ద్వారా విన్న అనేక పురాణాలు చెప్పాడు. ఏదో సందర్భంలో సూతుడు శౌనకాది మునులతో దేవీభాగవతం అనే పురాణం ఒకటి ఉన్నట్టు అని ఉన్నాడు. ఒకనాడు శౌనకుడు సూతుడికి ఆ విషయం జ్ఞాపకం చేసి, ఆ భాగవత పురాణం చెప్పమని కోరాడు. సూతుడు సరేనని మునులకు దేవీ భాగవత పురాణం చెప్పి వినిపించాడు.

సూతుడు ఆదిశక్తిని గురించి ఇలా చెప్పాడు :

''ఆమె మహాశక్తి. ఆమెయే విద్య. అన్ని లోకాలూ ఆమెనే ఆశ్రయించి ఉన్నాయి. సృష్టి స్థితిలయాలను కలిగించేది నిజంగా ఆదిశక్తే. ఆమె ప్రేరణ ద్వారా త్రిమూర్తులు ఆ విధులు నిర్వర్తిస్తారు. బ్రహ్మ విష్ణు నాభినుంచి పుట్టాడు; విష్ణువుకు ఆధారం ఆదిశేషుడు; ఆదిశేషుడు జలం ఆధారంగా ఉన్నాడు; ఆ జలానికే ఆధారం మహాశక్తి. లోకమాత. అలాటి దేవికి సంబంధించినది దేవీభాగవతం.''

సూతుడి వల్ల దేవీభాగవతం వినాలన్న కుతూహలంతో ఉన్న మునుల తరపున శౌనకుడు సూతుడితో, ''ఒకప్పుడు బ్రహ్మ మాకు ఒక చక్రం ఇచ్చి, దాని నేమి ఏ ప్రదేశంలో విరిగిపోతే ఆ ప్రదేశం పవిత్రమైనదనీ, అక్కడ కలి ప్రవేశించదనీ చెప్పాడు. ఆ చక్రం ఇరుసు ఇక్కడ

1. సూతుడూ—శౌన కాది మునులూ



విరిగిపోయింది. అందుచేత దీనికి నైమిశం అనే పేరు వచ్చింది. మేం ఇక్కడే ఉండిపోయాం. తిరిగి కృతయుగం వచ్చే దాకా ఇక్కడే ఉండి, కలి భయం లేకుండా ఉంటాం. ఇక్కడ మాకు పుణ్యగోష్ఠి తప్ప మరేమీ లేదు. అందు చేత నువు మాకు పుణ్యప్రదమైన దేవీ భాగవత పురాణం వినిపించు," అన్నాడు.

తిరిగి సూతుడు ఇలా చెప్పాడు:

''వ్యాసమహాముని నాకు ఎలా చెప్పాడో అలాగే నేను మీకు దేవీభాగవతం చెబుతాను. ఇప్పటికి ఇరవై ఏడు ద్వాపరాలు గడిచి, ఇరవై ఎనిమిదో ద్వాపరం జరుగుతున్నది. ప్రతి ద్వాపరంలోనూ ఒక వ్యాసుడు పుట్టాడు. వేదాలను విభజించి, పురాణాలు రచించిన సాత్యవతేయుడు అనే వ్యాసుడు (సత్యవతి కొడుకు) మా గురువుగారు. ఆయన తన కొడుకైన శుకుడికి ఈ దేవీభాగవతం చెప్పుతూంటే నేను భక్తి శ్రద్ధలతో గ్రహించాను. 'అల్లుడి వెంట తిను; కొడుకు వెంట చదువు' అంటారు గద పెద్దలు. ఈ దేవీభాగవతం విని శుకుడు తరించాడు. నిజానికి ఈ పురాణం విన్న వారు కష్టాలుపడటం సాధ్యం కాదు.''

ఇది విని మునులు సూతుణ్ణి, "శుకుడు వ్యాసుడికి ఎలా కొడుకు అయాడు? అతను అరణిలో పుట్టాడని గదా చెబుతారు?'' అని అడిగారు. అప్పుడు సూతుడు మునులకు శుకుడి జన్మ వృత్తాంతం ఇలా చెప్పాడు:

ఒకప్పుడు వ్యాసుడు సరస్వతీ నదీ తీరాన తపస్సు చేసుకుంటూ, పక్షులు దంపతులుగా జీవిస్తూ పిల్లలను కనటమూ, వాటి నోటికి ఆహారం అందించి, అవి తింటుంటే చూసి ఆనందించటమూ గమనించి, తనకు కూడా సంతానం కలిగితే ఎంత బాగుంటుందో గద అనే చింతలో పడ్డాడు. చక్కగా పెళ్ళి చేసుకుంటే భార్యతో సుఖపడవచ్చు, కొడుకులను కనవచ్చు. కొడుకు పెరిగి పెద్ద

వాడై, వాడు పెళ్లి చేసుకుంటే ముద్దుల కోడలిని చూసి మురిసిపోవచ్చు. కొడుకు లుంటే ఎన్ని లాభాలు! ముసలితనంలో ఎంతో శ్రద్ధగా సేవలు చేస్తారు.

అలా అనుకుని వ్యాసుడు కొడుకుల నిమిత్తం తపస్సు చెయ్యటానికి కాంచ నాద్రికి వెళ్ళి, ఏ దేవుణ్ణి ఆరాధిస్తే తనకు శీఘ్రంగా కోరిక నెరవేరుతుందా అని ఆలోచిస్తూండగా, ఆయన ఉన్న చోటికి నారదుడు వచ్చాడు. అతన్ని చూడగానే వ్యాసుడు నమస్కరించి, "స్వామీ, సమయానికి వచ్చావు. నా కోరిక తీర్చ టానికే వచ్చి ఉంటావు," అన్నాడు.

"సర్వజ్ఞుడివి. నీకు ఒకరి సహాయం అవసరమా? ఏమయినా నీ కోరిక ఏమిటో చెప్పు," అన్నాడు నారదుడు.

"కొడుకు లేని వాడికి పరలోకం ఉండదుట. ఏ దేవుణ్ణి ప్రార్థించితే నాకు కొడుకునిస్తాడు? చెప్పు, నారదా?" అని వ్యాసుడు అడిగాడు.

అప్పుడు నారదుడు ఇలా అన్నాడు: "ఒకప్పుడు, నా తండ్రి అయిన బ్రహ్మకు ఇదే సందేహం కలిగింది. ఆయన విష్ణులోకానికి వెళ్లి, విష్ణువును చూసి, 'నువే సర్వోత్తముడవనుకుంటు న్నాను. నీ కన్న గొప్పవాడుంటే చెప్పు,' అని అడిగాడు.



దానికి విష్ణువు, 'నువు సృష్టించే వాడి వనీ, నేను పెంపొందించే వాడిననీ, శివుడు హరించేవాడనీ జనం అనుకుంటారు. ఇది పొరపాటు. తేజస్సుతో కూడిన ఆది శక్తి మాత్రమే సృష్టి చేస్తుందని బుద్ధి మంతులు గ్రహిస్తారు. మనం సృష్టి స్థితిలయాలు చేస్తున్నామంటే అందుకు కారణం నీకు రజస్సూ, నాకు సత్త్వమూ, శివుడికి తమస్సూ తోడ్పడుతున్నాయి. లేనిపక్షంలో మనం గవ్వవిలువ చేస్తామా? నేను ఈ శేషతల్పం మీద పడుకున్నా, లక్ష్మి వెంట ఆరామాలలో విహరిస్తున్నా, పొగరుపట్టిన రాక్షసులను చంపినా ఆ శక్తి దయవల్లనే గదా? వెనక నేను మధు



''వ్యాసుడు లోకమాతనుగురించి తపస్సు చేశాడు.'' అని సూతుడు మునులకు చెప్పాడు.

వెంటనే మునులు, ''విష్ణువు తల తెగటం ఎలా జరిగింది? ఆయనకు గుర్రం తల ఎలా అతికారు? ఇదంతా నమ్మదగిన విధంగా చెప్పు.'' అని సూతుణ్ణి అడిగారు.

హయగ్రీవావతారం

పూర్వం విష్ణువు రాక్షసులతో పదివేల సంవత్సరాలు యుద్ధం చేసి, అలసిపోయి, ఎక్కుపెట్టి ఉన్న వింటిమొన మీద గడ్డం ఆనించి నిద్రపోసాగాడు. ఆ సమయంలో దేవతలు యజ్ఞం తలపెట్టి, విష్ణువు కోసం వెతుక్కుంటూ వచ్చి, అతను నిద్రలో ఉండటం చూసి, ఏం చెయ్యాలో తోచని స్థితిలోపడ్డారు. అప్పుడు శివుడు బ్రహ్మతో, ''నువు ఒక పురుగును తయారుచేసి, దానిచేత విష్ణువు వింటినారిని కొరికింపజెయ్యి. నారితెగగానే వింటిమొన పైకి లేస్తుంది. వెంటనే విష్ణువు నిద్రలేస్తాడు. యజ్ఞం సాగుతుంది.'' అన్నాడు.

బ్రహ్మ పురుగును సృష్టించి, విష్ణువు వింటినారిని కొరకమన్నాడు.

దానికా పురుగు, ''మహాత్మా, ఎలా చేసేది ఈ పని? మహాపాపం కాదా?

కైటభు లనే దానవులతో అయిదువేల ఏళ్లు పోరాడి, చివరకు జయం పొందింది శక్తి సహాయంతో కాదా? నేను స్వతంత్రుడనని ఒక్కనాటికి అనుకోకు. ఒకసారి వింటినారితో నా తల తెగిపోతే, నువు దేవశిల్పిచేత ఒక గుర్రం తల నాకు ఏర్పాటు చేయించావు. ఆ విధంగా నేను హయగ్రీవుణ్ణి అయానుగదా. అందుచేత నేను శక్తికి అధీనుణ్ణే. శక్తిని మించినది లోకాలలో మరొకటి ఉన్నదని నేను చెప్పలేను.'' అన్నాడు.

ఇలా చెప్పి నారదుడు వ్యాసుడితో, ''నువు ఆదిశక్తిని కోరుకున్నావంటే నీ కోరిక ఈడేరుతుంది.'' అన్నాడు.



తల్లీ పిల్లలను విడదీయుటమూ, భార్యా భర్తలకు ఎడబాటు చేయుటమూ, నిద్రా భంగం కలిగించటమూ బ్రహ్మహత్యలాటి మహాపాపాలు. ఈ పని నన్ను చేయమన్నారా ? '' అని అడిగింది.

'' నువ్వేమీ విచారించకు. యజ్ఞంలో అగ్నికి ఆహుతి చెయ్యని పదార్థమంతా నీకిస్తాం," అని బ్రహ్మ పురుగుతో అన్నాడు.

పురుగు సంతోషించి వింటినారిని కొరికింది. అప్పుడు పెద్ద ధ్వని పుట్టింది. భూమి అదిరింది. వింటికొన చప్పున పైకి తన్నటంలో విష్ణువు తల కాస్తా ఎగిరిపోయింది. అది చూసి దేవతలు దిమ్మరపోయి, ఏం చెయ్యాలో తెలీక, '' నువ్వే సర్వేశ్వరుడివి గదా, అన్నిలోకాలనూ భరించే వాడివిగదా ! నీ గతి ఇలా అయిందేమిటి? ఏ రాక్షసులూ చెయ్యలేని ఈ పని నీకెవరు చేశారు? నువు మాయకు కూడా అతీతుడివే, మాయ నిన్ను ఇలా చేసి ఉండటం సాధ్యమా ? '' అని విలపించారు.

దేవగురువైన బృహస్పతి వారితో, '' ఏడుస్తూ కూచుంటే ఏమవుతుంది ? జరిగిన దానికి ఉపాయం ఏదన్నా చూడండి,'' అన్నాడు.

'' దేవతలంతా చూస్తూండగానే విష్ణువు తల తెగి, ఎగిరిపోయింది గదా! మన ప్రయత్నం వల్ల ఏమవుతుంది ? దైవబలం వల్లనే ఏమైనా జరగాలి,'' అన్నాడు ఇంద్రుడు.

అప్పుడు బ్రహ్మ, '' దేనికైనా జగదీశ్వరి అనుగ్రహం కావాలి. ఆవిడే సృష్టి స్థితి లయ కారకురాలు. అందుచేత మీరంతా ఆ ఆదిశక్తిని ప్రార్థించండి,'' అన్నాడు దేవతలతో.

దేవతలు ఆదిశక్తిని ప్రార్థన చేశారు. వారిని కరుణించి దేవి ప్రత్యక్షమయింది.

'' తల్లీ, ఈ విష్ణువుకు ఈ గతి ఎందుకు పట్టింది? అతని తల ఏమయింది ? '' అని దేవతలు దేవిని అడిగారు. దేవి వారితో ఇలా చెప్పింది :

"విష్ణువుకు ఈ గతి ఎందుకు పట్టిందని అడిగారు మీరు. కారణం లేకుండా ఏదీ జరగదు. ఒకనాడు విష్ణువు పడకటింట లక్ష్మిని చూసి నవ్వాడు. అది చూసి లక్ష్మి కంగారుపడింది. విష్ణువు తన ముఖం చూసి ఎందుకు నవ్వాడు? తన ముఖం అంత అనాకారిగా ఉన్నదా? తనకన్న అందగత్తెను ఎవతెనైనా చూసి మోహించాడా? ఇలా అనుకుని లక్ష్మి సవతి పోరుకన్న మొగుడు చావటమే మంచిదనుకుని, తన భర్త తల సముద్రంలో పడుగాక అని శపించింది. ఆ శాపం తగిలి విష్ణువుకు ఈ గతి కలిగింది. ఇది ఇలా ఉండగా, హయగ్రీవుడనే రాక్షసుడు వెయ్యి సంవత్సరాలు నా కోసం తపస్సు చేశాడు. నేను ప్రత్యక్షమై, వరం కోరుకోమంటే, ఎవ్వరి చేతా తనకు చావు రాకూడదని కోరాడు. పుట్టిన ప్రాణికి చావు తప్పదు గనక మరేదన్నా వరం కోరుకోమన్నాను. అందుకు వాడు తాను హయగ్రీవుడు గనుక హయగ్రీవుడి చేతనే చచ్చేలాగ వరం కోరాడు. నేను అలా వరం ఇచ్చాను. వాడిప్పుడు లోకాలన్నిటినీ క్షోభింపజేస్తున్నాడు. మూడు లోకాలలోనూ వాణ్ణి చంపగలవాడు లేడు. కనక మీరు ఒక గుర్రం తల తెచ్చి, విష్ణువు శరీరానికి తగిలించి హయగ్రీవుణ్ణి సృష్టించండి. అలా చేస్తే ఈ విష్ణుహయగ్రీవుడు ఆ రాక్షస హయగ్రీవుణ్ణి చంపేస్తాడు."



ఇలా చెప్పి ఆదిశక్తి అంతర్హితురాలు కాగానే, దేవతలు దేవశిల్పిని పిల్చి, గుర్రం తల తెచ్చి విష్ణువు శరీరానికి అతకమన్నారు. దేవశిల్పి అలాగే చేశాడు. విష్ణువు హయగ్రీవ రూపంలో అదే పేరు గల రాక్షసుణ్ణి చంపి, లోకాలకు ఆనందం చేకూర్చాడు.

### మధుకైటభులు

తరవాత మునులు సూతుణ్ణి మధుకైటభుల కథ చెప్పమని కోరారు. అప్పుడు సూతుడ వారికా వృత్తాంతం ఇలా చెప్పాడు:

పాలసముద్రంలో శేషతల్పం మీద విష్ణువు నిద్రపోతున్న సమయంలో అతని చెవుల నుంచి ఇద్దరు రాక్షసులు పుట్టు కొచ్చి, నీటిలో ఈతలు కొట్టుతూ, తమ పుట్టుకకు ఆధారం ఏమిటా అని ఆశ్చర్య పడ్డారు. వారిలో కైటభుడు అనేవాడు మధువుతో, "ఈ మహాసముద్రానికీ, మనకూ ఏదో ఆధారం ఉండి ఉండాలి," అన్నాడు.

వాడు అలా అనగానే ఆకాశం నుంచి ఒక మాట వినిపించింది.

మధుకైటభులు ఆ మాట పట్టుకుని జపించసాగారు. ఇంతలో ఆకాశంలో ఒక మెరుపు మెరిసినట్టయింది. రాక్షసులు దాన్ని చూసి, అది శక్తితేజస్సే అని నిశ్చయించి, తమకు వినిపించిన ధ్వనిని మంత్రంగా భావించి, వెయ్యేళ్లు తపస్సు చేశారు. ఆ తపస్సుకు మెచ్చుకుని దేవి వారిని వరం కోరుకోమన్నది. వాళ్లు స్వేచ్ఛామరణం కోరారు. ఆమె వారు కోరిన వరం ఇచ్చింది.

తరవాత వాళ్లు జలంలోనే సంచరిస్తూ, ఒక చోట బ్రహ్మను చూసి, తమతో యుద్ధానికి రమ్మని పిలిచారు.

"మాతో యుద్ధం చెయ్యి. యుద్ధం చెయ్యలేకపోతే నీ పద్మాసనం విడిచిపెట్టి, ఎక్కడికైనా వెళ్ళిపో," అన్నారు వాళ్ళు బ్రహ్మతో.

బ్రహ్మ భయపడి, యోగసమాధిలో ఉన్న విష్ణువుతో, "మేలుకో, నాయనా! ఇద్దరు రాక్షసులు నన్ను చంపుతామంటూ వచ్చారు. నన్ను కాపాడు," అని వేడుకున్నాడు.

ఈ మాటకు విష్ణువు యోగనిద్ర నుంచి లేవలేదు. అప్పుడు బ్రహ్మ ఆదిశక్తియైన యోగనిద్రనే ప్రార్థనచేశాడు:

"తల్లీ, ఈ రాక్షసుల నుంచి కాపాడటానికి విష్ణువును లేవగొట్టు. లేదా, నువే నన్ను కాపాడు," అన్నాడు బ్రహ్మ. వెంటనే యోగనిద్ర విష్ణువును విడిచి వెళ్ళిపోయింది. విష్ణువు నిద్రలేచేసరికి బ్రహ్మ పరమానందం చెందాడు.



# అపాత్రదానం

కమలుడు సోమరి. సంపాదించదగిన వయసు వచ్చినా వాడు తన మీదే ఆధారపడటం చూసి, తల్లి వాణ్ణి డబ్బు సంపాదించుకు రమ్మని ఇంటి నుంచి వెళ్ళగొట్టింది. వాడు ఊరిబయట పాడుబడిన గుడిలో విచారంగా కూర్చున్నాడు.

గుడిలో ఉండే పిశాచం వాణ్ణి పలకరించి, "బాబూ, ఏమిటి నీకు వచ్చిన కష్టం?" అని అడిగింది. తనకు డబ్బు కావాలన్నాడు కమలుడు. పిశాచం వాడికి డబ్బుమూట ఇచ్చి, "సుఖంగా ఉండు," అన్నది.

కొడుకు డబ్బుమూటతో తిరిగి రాగానే తల్లి సంతోషించి, "దీనితో వ్యాపారం చెయ్యి," అన్నది. కమలుడి గుండె జారిపోయింది. డబ్బు వచ్చినందువల్ల వాడికి శ్రమ పెరుగుతున్నది.

ఆ రాత్రి పిశాచం వచ్చి, "ఇప్పుడు సుఖంగా ఉన్నావా?" అని అడిగింది. తన కష్టాలు డబ్బుతో పదింతలయాయన్నాడు కమలుడు.

"నేను అపాత్రదానం చేసి పిశాచినయి, పాత్రదానం చేసి ఈ జన్మ వదిలించుకుందా మనుకున్నాను. నువూ అపాత్రుడివే?" అంటూ పిశాచం డబ్బుమూట పట్టుకుపోయింది.

—మారుపాక సంధ్యారాణి.





# చిరంజీవి కథ

కల్యాణస్వామి అనే ఆయన వింధ్యారణ్యంలో ఆశ్రమం నిర్మించుకుని, తన వద్దకు వచ్చిన విద్యార్థులకు విద్య చెప్పేవాడు. "నీకు చదువుతో ఏం అవసరం?" అని ఆయన విద్యకోసం వచ్చిన వారిని అడిగితే, ప్రతి ఒకడూ బ్రతుకుతెరువుకోసం అని చెప్పేవాడు. ఆ సమాధానం ఆయనకు నిరాశ కలిగించేది.

కాని చిరంజీవి అనే శిష్యుడు అదే ప్రశ్నకు సమాధానంగా, "నా విద్యను మానవసేవకు వినియోగిస్తాను" అన్నాడు. ఆ మాటకు కల్యాణస్వామి ఎంతో సంతోషించి, అయిదు సంవత్సరాలు చిరంజీవికి చదువు చెప్పి, అతన్ని పంపేటప్పుడు, "అన్నమాట తప్పకుండా మానవసేవకు నీ జీవితాన్ని అంకితం చెయ్యి," అని జ్ఞాపకంచేశాడు.

చిరంజీవి ఆయన దీవెనలందుకుని ఒక గ్రామం చేరి, అక్కడ నివాసం ఏర్పాటుచేసుకున్నాడు. అతను గ్రామ ప్రజలకు మంచిచెడ్డలు విడమర్చి చెప్పుతుండేవాడు. వాళ్లుకూడా అతన్ని ఎంతో ఆదరభావంతో చూసేవారు.

అతను ఆ ఊరు వచ్చిన వారంరోజులకల్లా బందిపోటు గురించి తెలిసింది. నెలకొకసారి పదిమంది బందిపోటు దొంగలు ఆ ఊరికి వచ్చి తమకు అడ్డు వచ్చినవారిని చావగొట్టి, ఇళ్ళన్నీ దోచుకుని వెళ్ళిపోతున్నారు.

చిరంజీవి ఈ వివరాలు విన్నమీదట గ్రామప్రజలను అందరినీ సమావేశపరిచి, "మనిషికి పిరికితనంకన్న పెద్దశాపమూ, అవమానమూ లేదు. ఇంతమంది యువకులున్న ఈ గ్రామాన్ని పదిమంది దొంగలు భయపెట్టి, బాహాటంగా

దోచుకోవడమేమిటి ? వాళ్ళను ధైర్యంగా ఎదిరించి పట్టుకుని, రాజుగారికి అప్పగించండి,'' అన్నాడు.

చిరంజీవి మాటలతో చైతన్యంపొంది ఒక పాతికమంది యువకులు దొంగలను ఎదుర్కొవడానికి సాహసంతో ముందుకు వచ్చారు.

తరవాత పదిరోజులకు దొంగలు రానేవచ్చారు. చిరంజీవి చెప్పినప్రకారం పాతికమంది యువకులూ వాళ్ళను ఎదిరించారు.

అయితే కత్తిసాములోనూ, కర్రసాములోనూ ఆరితేరిన దొంగలు క్షణాలమీద యువకులను ఓడించి, ''ఇంతకాలమూ మమ్మల్ని ఎదిరించటానికిలేనిసాహసం ఈరోజుఎలావచ్చింది? ఎవడో దుర్మార్గుడు మిమ్మల్ని రెచ్చగొట్టి ఉండాలి. వాడెవడో చెబితే మిమ్మల్ని ఏమీచేయం,'' అన్నారు.

యువకులు తటపటాయించారు, కాని చిరంజీవి ధైర్యంగా ముందుకు వచ్చి, ''మీరు చేస్తున్నది అన్యాయం! దాన్ని ఎదుర్కొవలసిందిగా నేనే ఈ యువకులను ప్రోత్సహించాను,'' అని దొంగలతో అన్నాడు.

దొంగలు వెంటనే చిరంజీవికి స్పృహపోయేటట్టు చావగొట్టి, ''ఈ సారికి పోనిస్తున్నాం. ఇంకోసారి మమ్మల్ని ఎదిరిస్తే గ్రామానికి నిప్పుపెట్టి మరీ పోతాం,'' అని ఊరివాళ్ళను బెదిరించి,



ఇళ్ళన్నీ దోచుకుని తమదారిన తాము వెళ్ళిపోయారు.

చిరంజీవి చావుబ్రతుకుల్లో ఉన్నాడు. ఊళ్లో వైద్యుడనదగినవాడు లేడు. కొంతమంది అతన్ని దూరగ్రామానికి తీసుకుపోయి, వైద్యం చేయించారు. ఒకరోజల్లా స్పృహలేకుండా పడిఉండిన చిరంజీవి ప్రమాదస్థితినుంచి బయటపడి, కోలుకోసాగాడు. అతను తిరిగి తమ గ్రామానికి వస్తే ప్రమాదమని, అతన్ని తెచ్చినవాళ్లు, అతనికి తెలివి వచ్చేలోపునే తమ గ్రామానికి తిరిగి వెళ్ళిపోయారు.

అయితే పదిహేనురోజుల అనంతరం చిరంజీవి మరొకమనిషిని వెంటబెట్టుకొని ఆ గ్రామానికి తిరిగివచ్చాడు. అతను మళ్ళీ రావటం గ్రామ ప్రజలకు ఎంత మాత్రమూ నచ్చలేదు.

చిరంజీవి ఊరిపెద్దలను కొందరిని కలుసుకుని, "ఈ ఉళ్లో వైద్యుడు లేక పోవటంవల్లనేగదా మీరు నన్ను పొరుగూరు తీసుకుపోవలసి వచ్చింది? ప్రతి గ్రామనికీ కనీసం ఒక వైద్యుడైనా ఉండాలి. అందుకే నేను ఈ వైద్యుణ్ణి తెచ్చాను. ఇతను వైద్యంలో గట్టివాడు. ఈ గ్రామంలో స్థిరపడటానికి ఇతన్ని నేను ఒప్పించాను," అన్నాడు.

చిరంజీవి మాటలకు ఊరిపెద్దలు చలించిపోయారు. దొంగలవల్ల ప్రాణ భయం అందరికన్న చిరంజీవికే ఎక్కువ. అయినా తాము భయపడు తూంటే అతను ప్రాణంకూడా లక్ష్య పెట్టక, గ్రామ క్షేమంకోరి వైద్యుణ్ణి తెచ్చాడు!

ఈసారి చిరంజీవి పైన గ్రామంలో అందరికీ అపారమైన గౌరవం కలిగింది. మరోసారి దొంగలు వచ్చేసమయానికి వందలసంఖ్యలో గ్రామప్రజలు వాళ్ళను ఎదిరించి, పట్టుకుని రాజుగారికి అప్పగించారు.

ఆ గ్రామానికి తనవల్ల జరగదగిన ఉపకారం జరిగిందని భావించి, చిరంజీవి అక్కడినుంచి సెలవుతీసుకున్నాడు.



# లోభి

ఒక గ్రామంలో ఇద్దరు వర్తకులు ఉండేవారు. ఒకడు పరమలోభి. రెండోవాడు పేరుపడిన దాత. అతని సంపాదనలో హెచ్చు భాగం దాన ధర్మాల కింద ఖర్చు అయేది. లోభి వర్తకుడు రెండో వాడి పేరు ప్రతిష్ఠలు చూసి ఓర్చలేక పోయేవాడు, అందుకని అతన్ని అవమానించటానికి అవకాశం కోసం ఆత్రంగా చూస్తూండేవాడు.

ఒకసారి రచ్చబండ దగ్గిర మంచివాడు గ్రామస్థులతో ఏదో చెబుతున్నాడు. గ్రామస్థులు అతను చెప్పేది శ్రద్ధగా వింటుండగా లోభివాడు అటుగా వచ్చి, ఆ దృశ్యంచూసి అసూయ పట్టలేక, " ఏమిటోయ్, అందరి ముందూ ఏవో కోతలు కోస్తున్నావ్ ? " అని అన్నాడు.

" అబ్బే, మరేమీలేదు. నువు ఎంత ధర్మబుద్ధి కలవాడివో, నీలో దాతృత్వం ఎలా మూర్తీభవించిందో చెబుతున్నాను," అన్నాడు మంచివాడు.

—కె. ప్రభాకరదేవ్.



## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు! 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1978 డిశెంబర్ నెల సంచికలో ప్రకటింపబడును.







Gopal Shroti

Devidas Kasbekar

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్కమాటలోగానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ అక్టోబరు నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 25/—లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి:—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## ఆగస్టు నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : అమ్మ ఆకలి

రెండవ ఫోటో : అమ్మా, ఆకలి !

పంపినవారు : కృష్ణప్రసాద్ బి, ఎ. టి. అగ్రహారం, గుంటూరు—4

బహుమతి మొత్తం రు. 25/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

**Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor : NAGI REDDI.**

మళ్ళీ దీపావళి వచ్చింది...



ఇంటింటా దీపాల వెలుగు, కొత్త

**కరోనా** పాదరక్షలు

పాదాలకు జిలుగు



సెన్సేషన్



దిలీప్ వెడ్జ్



స్కాలర్



ఆశా



నిక్కీ




తయారు చేయువారు :

**కరోనా సాహు కం. లి.**

రిజి. ఆఫీస్ : 221, దాదాభాయ్ నౌరోజి రోడ్, బొంబాయి 400 001.

CHAITRA-CS-126 TEL